శ్రీ

# బుద్ధబోధసుధ



[పదియంకముల నాటకము.]

ఇది

ప్రచండ చాణక్యము; సారంగధర చరిత్రము
మొదలగు నాటకములు రచించిన


## పానుగంటి—లక్ష్మీనరసింహారావుగారిచే


రచియింపఁబడి

డి. వి. రఘునాథరావుగారిచే




తనుకు

శ్రీ సౌదామినీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి
ప్రకటింపఁబడియె.

1910







మొదటికూర్పు 1000 ప్రతులు





దీని వెల 1—0—0.

# పీఠిక.

శ్రీ బుద్ధశంకర రామానుజానందతీర్థచైతన్యాది మతకర్తలబోధనములు జనులకు సుబోధమగునట్లు నాటకములవ్రాయఁదలఁచి యవతారపురుషుఁడని యెన్నఁబడిన బుద్ధాచార్యునిబోధనముల నిందుపొందుపఱచి, "బుద్ధబోధసుధ" యనుపేరున నీనాటకమును 10-10-1909 సం॥రం తేదిని మొదలుపెట్టి 10-1-1910 సం॥రం తేదిని వ్రాసిముగించితిని. బుద్ధునిగూర్చి బుద్ధమతమునుగూర్చి జనసామాన్యమునకు విపరీతాభిప్రాయములున్నవి. అందుల కనేక కారణములుండవచ్చును. అవియిట నుదహరింప నావశ్యకత లేదు.

బుద్ధమతబోధనములఁ దెలిసికొనఁదలఁచి నేను కొన్నిగ్రంథములఁ జదువఁబ్రయత్నించితిని; కాని కావలసినగ్రంథములు కొన్నిముద్రింపఁబడి యిదివఱకే విక్రయింపఁబడియుండుటచేత లభింపవయ్యెనను చింతతోనుండ, నాయల్లుఁడును సౌదామినీముద్రాక్షరశాలాధికారియు నగు చి॥ బ్రో॥ వేంకటరమణారావువలన, నాయుద్యమమును దణుకులో ఇంజనియర్లుగానుండు మ॥ రా॥ రా॥ పోలిసెట్టి రంగనాయకులునాయుడుగారెఱింగి, వారియొద్దనున్న బుద్ధమతగ్రంథములనన్నియు నాయొద్దకుబంపి నాకుమహానందము నొసఁగిరి. వారనేకగ్రంథద్రష్టలు, బుద్ధిశాలురు, వివిధమతరహస్యవేదులగుదురని నేనువినియుంటినే కాని వారినిజూచు నానందము నాకింకఁగలుగనే లేదనిచెప్పుటకు లజ్జపడుచున్నాను.

Dialogues of the Buddha, Rhys David's Buddhism Sayana Madhavachari's Sarvadarsana Sangraham, Rhy's David's Buddhist India, Lakshmi Narasu Naidu's

Essence of Buddhism. మొదలగు వారుపంపిన గ్రంథములను నేను జదివి చేతనైనంతవఱకు గ్రహించి యీనాటకమును వ్రాసితిని. పెద్దలు నాతప్పులను మన్నింతురుగాక.

ఈగ్రంథమునుగూడ శ్రీ శ్రీ పీఠికాపురపు రాజావారే స్వధన త్యాగమునఁ నచ్చువేయించిరి. విద్యాగరిష్ఠులు, కృతాభిమానులునగు శ్రీవారికి భగవంతుఁడు సర్వశ్రేయములిచ్చి రక్షించుఁగాక!

దీనికిఁగూడ నాంది ప్రస్తావనలను నా మిత్రరత్నమగు బ్ర॥ శ్రీ॥ కూచినరసింహముగారు వ్రాసిదయచేసినందులకు వారికనేక నమస్కారములను జేయుచున్నాఁడను.

ఆనెగొంది, } పా॥ లక్ష్మీనరసింహరావు.
ది 4—6—10. }

# ఈనాటకమునందు వచ్చుపాత్రలు.

## పురుషులు.

బుద్ధుఁడు—కథానాయకుఁడు.
కౌండిన్యుఁడు—బుద్ధశిష్యుఁడు.
ఆనందుఁడు— ,,
యశుఁడు—జూదరి.

గాలవుఁడు
శార్ఙ్గరవుఁడు } పౌరులు. (గయ)

పురాణకశ్యపుఁడు.
మక్కలిఁడు.
అజితకేశకంబళుఁడు.
మహాచార్యుఁడు.
దేవదత్తుఁడు. } వివిధమతావలంబకులు.

అంగుళిమాలుఁడు.
అలవకుఁడు. } బుద్ధునిఁ జంపఁబోయినవారు.

అనిరుద్ధుఁడు.
సోమదత్తుఁడు. } పౌరులు. (కోసల)

అంబష్ఠుఁడు—ప్రసేనజిన్మహారాజుచే బుద్ధునితో వాదింపఁబంపఁబడినవాఁడు.

చంద్రశేఖరుఁడు.
విరూపాక్షుఁడు. } పౌరులు. (మగధ)

అజాతశత్రుఁడు—మగధరాజు.
గోపాలదాసుఁడు—ఒకశిష్యగణములోనివాఁడు.



# బుద్ధబోధసుధ

శ్రీరామా.

——:o:——

(నాంది)

ఉ. అన్యులదుఃఖము ల్స్వమహి * తార్తులుగాఁ దలపోసి లోకసా
మాన్యసురంతదుష్కృతుల * మాపఁగఁ గంకణ మూని భూతకా
రుణ్యజితేంద్రియత్వముల * ప్రోషదియైనవిశుద్ధబుద్ధుఁడై
తన్యమగణ్యపుణ్యగుణ * ధన్యులఁ జేసెడుఁగాత మిమ్ములన్.

(నాంద్యంతమున)

సూ—బావా! పారిపార్శ్వకా!

పా—(ప్రవేశించి) చిత్తము.

సూ—ఈ మన మాడఁబోవు పానుగంటి లక్ష్మీనృసింహారావు "బుద్ధ బోధసుధ" యనువదవనాటకము మిక్కిలి విచిత్రమైనది సుమా!

పా—ఆతనినాటకము లన్నియు రసవంతములునుఁ జిత్రములే. ఇందుఁ జమత్కారవిశేష మేమున్నది?

సూ—రచనాచమత్కృతిమాట గాదోయి!

పా—మఱి దేనిమాట?

సూ—ఇదిగో విను.

గీ. ఆత్మ పూజ్యంబు, పరమాత్మ * యావగిదిన
పూజ్య, మఖలంబు శూన్య మే * పూరుషోత్త

మునికి; నాదేవతాంశజ * బుద్ధబోధ
నంబుఁ బ్రకటించు నయ్యా! యీ * నాటకంబు.

పా—నాటకవైచిత్ర్యమున కేమిగాని మీమాటలసందర్భ మత్యాశ్చ ర్యకరముగఁ గాన్పించుచున్నది.

గీ. ఉన్నదంతయు లేదంచు * నుర్విఁ జాటి
నతఁడెఁ బురుషోత్తముఁడుగఁ బ * ల్కితివి; దైవ
జలదఘుంఝూనిలంబు బయి * మొలఁగినట్టి
వాని నంటివి బుద్ధదై * వం బటంచు.

సూ—అలాగుననా!

సీ. సకలభోగముల కా * స్పదమౌ మహారాజ
వంశంబునందు ను * ద్భవము నొంది
సదమలరూపాభి * జాత్యమానితగుణ
శీలయౌ నెలనాఁగఁ * జెట్టవట్టి
బాలసూర్యప్రభా * పటలి మించినమంజు
తనుకాంతి గలముద్దుఁ * దనయుఁ గాంచి
సంయమికేని యా * సలుగొల్పు పరివార
విత్తరాజ్యాదిసం * పత్తిఁ బడసి

గీ. వీని నన్నింటి దుఃఖాత్మ * విభవములుగ
నెంచి, తృణములయట్ల వ * ర్జించి పోయె
బుద్ధదేవుండు; వానిని * బూరుషోత్త
ముఁడని చెప్పిన నాశ్చర్య * పమదె సఖుఁడ!.

పా—వైభవములమధ్యమున నుండి వానినెల్ల నొక్కత్రుటిలోఁ ద్యజి యించి సన్యాసియై పోవుటచే ననన్యసామాన్యధైర్య వైరాగ్య సంపన్నుఁ డగుబుద్ధునిఁ బురుషోత్తముఁ డంటిరి సరియే! కాని త

టోత్తమా! ఆయనదైవముగూడ నెట్లగును? అతఁడే దైవ మైన యెడల దైవము లేఁడని చెప్పి యాత్మహత్యఁ గావించుకొనునా? ఇదిపెద్దయసందర్భముఁ బుట్టిమునుకగా నున్నది.

సూ—ఏమియు నసందర్భము లేదు!

ఉ. ఆఁకటి, దప్పిని న్నిదుర * నన్నిఁటిఁబట్టి వధించి, యాత్మబా
ధాకరమౌ పరోపకృతి * ధర్మముగాఁ గొని చేసె దానిచే
లోకము సౌఖ్యమందు నని; * లోకహితార్థము బుద్ధుఁ డాత్మహ
త్యాకరణైకదీక్షుఁడని * యన్నను నీవనవచ్చు భావుకా!.

గీ. పరులదుఃఖంబుఁ జల్లార్చ * తలఁచి భిన్న
మానసాహంభావమును మాపి * యాత్మ దోర్చి
తాను సర్వాత్మకుండయి * తరణమార్గ
మును గఱపె బుద్ధుఁ డవతార * పూరుషుండు.

భిన్నాత్మబుద్ధినాశనము పరశ్రేయోదాయకము. లోకమంతయుఁ దానే యనుకొనుట యవతారమహాపురుషలక్షణము. ఇట్టిలక్షణము బుద్ధునియందుఁ గాన్పించుచున్నది. కావున నతఁడు కేవలదైవస్వరూపుఁ డగుమహాపురుషుఁడు.

పా—అయ్యయ్యో! నాస్తికమత మనుప్రతీతిగల బౌద్ధమతమును స్థాపించినవాఁడు “మహాపురుషుఁడు” ను రామకృష్ణాదులవలె “నవతారపురుషుఁడును” అని చెప్పెద వేమి?

సూ—ప్రతీతిప్రమాణుఁ డవుగావున నడిగెదను—జనసామాన్యము దేనిని శ్రీమహావిష్ణునవతారములలోఁ దొమ్మిదవదిగఁ బరిగణించుచున్నది?

పా—రామ రామ! ఆబుద్ధుఁ డీబుద్ధుఁడేనా?

సూ—నీవు నీవును నేను నేను నయినట్లే! లోకము వ్యత్యస్తమై కట్టుఁ దప్పినప్పు డస్మదాదులు దాని నవకింపఁజాలరు. మనలోపములు

శే దిద్దికొనఁ దేనివారము ప్రపంచము నంతయు నొల్లు విద్ధ నమశ
ట్టిదము? తత్తదవసరములయం దాద్యగ్రాహ్యతత్త్వమే యొక
మహాపురుషరూపమున నవతరించి, పాడయినలోకమును దిరుగఁ
జక్కఁబఱిచి నిర్వాణముఁ జెందును, "ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగేయుగే" యనుగీతావాక్యము నెమరునకుఁ దె
చ్చికొనుము.

పా—అట్లే కానిండు. బుద్ధుఁడు దైవావతారమే యైనయెడల, వేదప్రా
మాణ్య మేల నిరసించెను? దైవాస్తికత నేల నిరాకరించెను?

దూ—నాకుఁ దోఁచినట్లు చెప్పెదను విను.

కర్మపాషండులై, ఛాందసులై, వేదరహస్యము సత్యముగఁ దెలి
సికొనఁ జాలక, విహితకర్మములని వృథావ్యాపారములే కాక,
హింసాకృత్యములఁ గోట్లకొలఁదిఁ జేయుచు, సవనశాలలనెత్తురు
వఱదలఁ దడుపుచు, మేదోమాంసమేదురములఁ గావించుచు,
స్వర్గభోగాదిస్వసుఖాభిరతులై, నిర్దయహృదయులై, నీతిబాహ్యు
లై, దురహంకారభాజనులై, యసత్కార్యలంపటులై, వైదికమ
తభంజకంబు లగుమతముల నెన్నెన్నియో కల్పించుకొని, యిం
టఁ బొట్టకొఱకు ప్రాయిపెట్టుకొని, మాంసనివేదనసురాపానాది
నికృష్టాచారంబులపాల్పడి, దేశక్షోభంబుగావించుచు, దేవుని పే
రు నాత్మపేరు పెట్టుకొని, వేదము సంఢచేసికొని, జనులుపాడగు
చుండఁగా, శ్రీమద్భగవద్గీతావాక్యానుసారముగ, దయామయుఁ
డైన యాభగవంతుఁడు బుద్ధరూపమున నవతరించి—

గీ. రోగకీలక మెఱిఁగి యా ♦ రోగ్యమిచ్చు
ఘనభిషజ్మౌళిపోల్కి సం ♦ ఘస్థమైన
బహుదురాచారములఁ గూల్చెఁ ♦ బ్రజనుభూత
దయయుఁ దృష్ణావిముక్తిబో ♦ ధంబు సేసి,

పా.—బాగుగనే యున్నది. కాని యంతటిమహాత్ముఁడు పరమపావనమైన వేదంబును, తత్ప్రతిపాద్యమైన పరమాత్మను నేలకొట్టిపారవేయ వలయును?

సూ.—గీ. ఐహికాముష్మికార్థంబు ♦ లందు నెక్కు
ముఖ్యమైన రహస్యంబు ♦ పొడవడుఁ జుమీ;
కార్యయోగ్యత, దోషవం ♦ క్రాంత సాధ
నములఁ గూడను జేయు మో ♦ గ్యముల పగిది.

అందుచేతనే బుద్ధుని వేదప్రామాణ్యగర్హణము గర్హ్యముగా లేదు. మధుమేహపీడితునకు మధురపదార్థపరిత్యాగ మవశ్యకర్తవ్యమైనట్లు వేదవిపరీతగ్రహణజన్యజడత్వబాధాక్రాంతులౌ నాకాలపుఁ బ్రజకు శ్రుతిప్రమాణ మగ్రాహ్యముగాఁ జేయవలసి వచ్చెను.

పా.—అంతటితోఁ నాఁగకుండ, సర్వచరాచర సృష్టిమూలమైన భగవంతుఁడే యూడిపోయెనే?

సూ.—వేదమునకు వచ్చినచిక్కు వేదాధారునకుఁ గూడ నాకారణము చేతనే రావలసి వచ్చెను. ఐనను బుద్ధాచార్యుఁడు కేవలనిరీశ్వరవాది కాఁడుసుమా! ఏదో యొక్క దుర్జ్ఞేయమైన మూలశక్తి యున్న దనియు, నదియే "ధర్మకాయ" మనియు, నిర్వాణప్రాప్తి యన జీవుఁడు ధర్మకాయ మగుటయే యనియు, నిట్టివాక్యము లతనిబోధంబులం దచ్చటచ్చటఁ గన్పట్టుచున్నవి. స్వోద్దిష్టప్రయోజననిరోధకర మని, దానింగూర్చి నెక్కుచెప్పుటమాత్రము లేదు.

పా.—అటులైన "దుఃఖ, క్షణిక, స్వలక్షణ, శూన్య" వంతులైన బుద్ధమత మార్గమతావలంబులకు నమాదరణీయ మనియే మీ యభిప్రాయమా?

సూ.—సీ. జన్మ మొక్కటి గాదు ♦ చాలజన్మము లంట,
మేకమే కద యందు ♦ నిందుఁ గూడ
సంసార మన దుఃఖ ♦ జలరాశి యని కొందు,
లేకమే కద యందు ♦ నిందుఁ గూడ
దృష్ణపోకార్ప ము ♦ క్తికి సాధనం బంట,
మేకమే కద యందు ♦ నిందుఁ గూడ
సత్ప్రవర్తనము శ్రే ♦ ష్ఠం బంచు బోధించు,
లేకమే కద యందు ♦ నిందుఁ గూడ.

గీ. దుఃఖమోక్షంబె మోక్ష మం ♦ దురుగదా! యు
భయమతములందు; నొంచి యి ♦ వ్వాని నెల్లఁ
దారతమ్యంబు చెప్పు బు ♦ ద్ధమతసార
మునకు వేదాంతబోధన ♦ మునకు నీవె!

పా.—అదేమి పాపమా కాని మీమాటలు వాతల కెక్కకున్నవి. దైవసహితమగుమత మార్షమతము; దైవరహిత మగుమతము బుద్ధమతము. మీరెన్నిగుంటచిక్కులుపెట్టినను వీనికి రెంటికి సామరస్యము గనఁబడదు.

సూ.—ఇటువిను మిత్రమా! వేదమతము వారు దైవముగలఁ డందురు. బుద్ధమతమువారును వేఱుపేరు పెట్టిరిగాని యట్టితత్త్వమొండు గలదనియే చెప్పుచున్నారు. ఆతత్త్వమిట్టిదనిమాత్రము వీరును వారును గూడ విస్పష్టముగఁ జెప్పఁజాలరు. ముక్త్యనంతరము జీవులు ప్రత్యక్షానుభవమునఁ గాంచఁదగినది గాని, తత్పూర్వామిదమిద్ధమని నిర్వచించుటకుఁ గాని బోధించుటకుఁగాని, యెవ్వరికి శక్యము గాదు. ఈరహస్య మెఱింగియే శ్రీబుద్ధాచార్యుఁడు దానివిషయమున మౌనీభావమును వహించినాఁడు. దాని గూర్చి తల పగులఁగొట్టుకొనఁగూడ దనియుంగూడఁ గొన్నిపట్లఁ జెప్పినాఁడు.

పా—వేదాంతులుగూడ బ్రహ్మనిరూపణము చేయనే లేదా?

సూ—చేయనట్లే చేసినారు—"నేతినేతి" వాక్యముల—అదియుఁగా కాతఁ డవాఙ్మానసగమ్యుఁ డని పెక్కుతావులఁ జెప్పఁబడి యున్నది. "యతో వాచోనివర్తంతే, అప్రాప్యమనసాసహ" మొదలగు శ్రుతిభాగములుగూడ నట్లే ఘోషించుచున్నవి. వేఱుగాఁ జెప్పిన నెట్లుపొసఁగును?

గీ. మేయ మగుమానసముచే న ♦ మేయు దేవుఁ
దెలిసికొనఁ జూచువాఁడు వెం ♦ గలియె సుమ్ము
కుంచమును దెచ్చియెంత యు ♦ త్నించి యేని
గిద్దలోపల నెవఁ డిఱె ♦ కింపఁగలఁడు?.

కం. జ్ఞానాదిసాధనంబుల
మానసముం దగ్ధపటస ♦ మానము చేయం
గాననగు, నగును బ్రహ్మము
మానవుఁ; డింకొట్టు లద్ది ♦ మననునఁ జిక్కున్.

ఈవాక్యములే కాకపోయిన, నేతదర్థబోధకము లగువాక్యములు బౌద్ధమతమునందునుఁ గాన్పించుచున్నవి.

పా—బావా! ఈశ్వరోపాసకులమానసికప్రార్థనములుగూడ ననుపయుక్తములేనా?

సూ—ఔ! బౌద్ధమతమున నట్లే. జ్ఞానసాధనములుగ నంగీకరింపఁబడినవి గాని యార్షమతసిద్ధాంతదృష్టిచేఁగూడఁ బ్రతిమార్చనలువలె నవియు నల్పజ్ఞ కృత్యములే.

పా—ఆర్యా! బౌద్ధులు సేశ్వరవాదులుగారు కాని లోకాయతికులవలె "ఋణంకృత్వా ఘృతంపిబే"త్తనియు "ఘృతంపీత్వాఘటంత్యజే" త్తనియుఁ జెప్పెడివారు గారుకదా! నీతి, భూతదయా,

వైరాగ్యప్రధాన మైనమతముగదా వారిది! అట్టిచో నాత్మదైవములు పలికిరో తత్సమానములో నైనప్పుడు, స్వానుభవరాజ్యముఖత్వమునకును, సత్ప్రవర్తనమునకును గత్యాధారములెక్కడ?

సూ—బావా! బాగుగఁ గనిపట్టితివి. ఈకారణముచేతనే తొలుత నీ నాటకము విచిత్రమైన దని చెప్పితిని. ఆవైచిత్ర్య మిద్దియే సుమా! ఇట్టిగగన సాధ్యోపమంబగుమతముతో బుద్ధదేవుఁడు సంఘమునెల్ల నెట్లు సన్మార్గములకుఁ ద్రిప్పినాఁడో చూడుము. ఈ యొక్కటియే యాతనిదైవత్వమును స్థాపింపఁగలదని నాయభిప్రాయము. ఆయన—

ఆ. గీ. అతులదివ్యతేజ, ♦ మమలచారిత్రం, బ
మేయభూతదయ, య ♦ మేయశాంతి,
పరజనోపకార ♦ వైరాగ్యసంపత్తి,
యును వహించి జనుల ♦ నుద్ధరించె.

ఆ. గీ. పరుసవేది సంటు ♦ కటియినుమంతయు
బసిఁడిముద్ద యైన ♦ పగిదిఁగాని
యొంతదుష్టచిత్తుఁ ♦ డేని బుద్ధునిఁ జేరి
యకలుషాంతరంగుఁ ♦ డయ్యెఁ గాదె!

దీనికిఁ దార్కాణములు మానుపాశియు నమితేనురాపోయియు నగు “అలపకుఁడు” ను వార్లుగొట్టి దోఁచుకొనిన బదుకం “అంగుళిమాలుఁడు”ను. ఇంకొక్కమాట వినుపారిపార్శ్వకా! బౌద్ధమతావలంబకు లీప్రపంచమునం దిప్పుడు రమారమి మూఁడువవం తున్నారఁట.

పా—ఆర్యా! యిప్పుడు మీమాటలు నాకు నచ్చినవి. నిశ్చయముగా నీనాటకము పవిత్రగ్రంథ మని నాకుఁ దోఁచుచున్నది.

సూ—సందేహమేమి? ప్రతికుటుంబమునను బాలుర, వృద్ధులు, స్త్రీలుఁ బురుషులుదీనిఁ బురాణముగ, భారత భాగవత రామాయణము లవలెఁ బఠించిన శ్రేయోభివృద్ధిఁ గాంతురు. ఆమూలాగ్రశాంతరసపూర్ణ మైననాటకము; సమంజసధర్మబోధకము; సంసృతిసాగరతరణసాధనసత్కీర్తిమార్గప్రదర్శకము.

గీ. బుద్ధగురువృత్తగూర్చియు ♦ బౌద్ధమతముఁ
గూర్చియును మనవారలు ♦ గొంతకొంత
తెలిసికొన్ కాని లెస్సగాఁ ♦ దెలుపలేదు;
ఈకొఱంత దీర్చె నీసత్కృ ♦ తీశ్వరుండు.

పా—భగవద్దత్తమైననీటి వక్తృత్వరూపమున భగవదర్పితము చేసి శిష్టులు చరితార్థులైనట్లు లేకవి దైవదత్తమైనబుద్ధిని బుద్ధాచార్యమహాపురుషునికై వినియోగపఱిచి ధన్యుఁడైనాఁడు. బుద్ధమతము రూపున మనుదురభిప్రాయమును దొలఁగింపవలఁతియగుగ్రంథమును దృశ్యప్రబంధరూపమున నాంధ్రదేశమున కొసఁగి పుణ్యముగట్టుకొనినాఁడు. అతని కెవ్వఁడు శుభ మగుఁగాక!

సూ—తథాస్తు.—

గీ. నీతి వ్యాపింపఁజేయఁ గాం ♦ డిన్యుఁ డెల్ల
బుద్ధునకు నాదిశిష్యుఁడై ♦ పొందుపడియె
నిప్పు డాకల్లభోద్భవు ♦ నీ ప్రశస్త
మైననాటక మాడున ♦ ద్యమనమునందు.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

---

శ్రీ

# బుద్ధబోధసుధ.

## ప్రథమాంకము.

[ప్రదేశము. ఉరుబిల్వామహారణ్యము.]

(ప్రవేశము. బుద్ధుడు. సన్యాసి రూపధరుఁడు. కౌండిన్యుఁడను శిష్యుఁడు.)

కౌం—దేవా! ఏమంటిరి?

బుద్ధు—కౌండిన్యా! చూచితివా? నాకు మాటలాడుశక్తి తగ్గినది. నీకు వినుశక్తి తగ్గినది. మఱియొకమారు చెప్పెదను. వినుము. ఇఁక నవి యేవియు నక్కఱలేదు.

కౌం—ఏల?

బుద్ధు—నిరుపయోజనములగుటచే—

కౌం—ఆఱుసంవత్సరములనుండి తదేకదీక్షగాఁ జేయుచున్న నిష్ఠుర యోగాభ్యాసనిష్ఠానుష్ఠాన బంధములనిప్పుడు త్యజింపఁ దలఁచితిరా?

బుద్ధు—ఆఱుసంవత్సరములయనుబంధమేమి? అధికమా! పదునాఱుసంవత్సరముల భార్యానుబంధమును బరిత్యజింపఁ లేదా? ముప్పదియైదు సంవత్సరముల మాతాపితృదేవతానుబంధమును వెగ గోసికొనలేదా? అసంఖ్యాకసంవత్సరాగతవైభవ సమగ్రతాను

బంధమును దెంపుకొనలేదా? అన్నిటికంటె నధికమగు నాటుజా
ముల పుత్త్రాదిను బంధమును బాపుకొనలేదా? బంధదైర్ఘ్యదా
ర్ఢ్యములతోఁ బనియేమున్నది?

కౌం—ఇట్టిసంగపరిత్యాగము యోగాభ్యాసము కొఱకేకాదా?

బుద్ధు—కాదు.

కౌం—సిద్ధార్థదేవా! ముక్తిదేనికొఱకు?

బుద్ధు—అసిద్ధార్థుడనైన నన్నట్లుపిలువకుము. అది చిత్తశాంతికొఱకు—
యోగాభ్యాసమువలన నదిలభింపనపుడు దానిని ద్యజియించుట
తప్పగునా?

గీ. మందుపనిసేయనప్పుడు ♦ మానఁదగదె?
చెవికిబెట్టరానపుడుల్ల ♦ జింపఁదగదె?
చట్టమువిరుద్ధమైనపుడు ♦ నట్టఁదగదె?
బాటతప్పినయప్పుడు ♦ వదలఁదగదె?

కౌం—ఏమిస్వామి! యోగాభ్యాసముకూడ ముక్తికి దుష్పథమనుచు
న్నారే?

బుద్ధు—అదియొకరీతి ముక్తికిసాధనమే యగును.

కౌం—అదెట్టిది?

బుద్ధు—దేహదార్ఢ్యముక్తికి, చిత్తసౌఖ్యముక్తికి, ప్రాణాయాముముక్తికి.

సీ. కనుమూసి సీటము ♦ గ్గఁగ ముక్తి యైనచో
మనకంటెఁ గొక్కెర ♦ ఘనతరంబు
నేలతొఱ్ఱలలోన ♦ నివసింపఁగా ముక్తి
యైన నెండ్రికచాల ♦ నధికమగును
తలక్రిందుగనుఱ్వేలి ♦ తపియింపఁగాముక్తి
యైన గబ్బిలముమ ♦ హత్తరంబు
చిరకాలముపవాస ♦ సేవముక్తియయిన
నుత్తరధ్రువకిటి ♦ యుదుతరంబు

పవనభుక్తిముక్తి యయినఁ ♦ బాముగొప్ప
శ్వాసమును బలాత్కృతిబిగ్గఁ ♦ బట్ట ముక్తి
యయిన యజ్ఞపశువుమేటి ♦ యాకుఁదినఁగ
ముక్తి యగునెడఁగొంగళి ♦ పుసుగుమెఱుఁగు.

కౌం—దేవా! వేదశాస్త్రములు యోగాభ్యాసాదుల ప్రాశస్త్యమును గూర్చి సహస్రముఖముల ఘోషించుచుండ—

బుద్ధ—వేదశాస్త్రములు నేనుగూడ శ్రద్ధతోఁ జదివితినా?

కౌం—చదువ కేమి?

బుద్ధ—పరమనిష్ఠురముగ నిధిధ్యాసధారణాదుల నభ్యసించి నిరాఘాటదీక్షాపాటవముననుష్ఠించుచుంటినా?

కౌం—అయ్యో! సందేహ మేమి?

బుద్ధ—నా వేదశాస్త్రజ్ఞానమునుగూర్చి నీకుసందేహము లేదు. నా యోగానుష్ఠాన నైష్ఠుర్యమును గూర్చి సందేహము లేదు. కానియీ నాయభిప్రాయయాథార్థ్యమునుగూర్చి మాత్రమే సందేహమా!

కౌం—కాని యింకఁ గొంతకాలము దీనినే యనుష్ఠించునెడల—

బుద్ధ—ఇంక నెంతకాలము! ఒడలుమంటలెత్తి, చెవుల బెద్దహోరుపుట్టి, కనులు చీఁకటులుగ్రమ్మి, బ్రహ్మరంధ్రమునఁ బోటుపుట్టి యస్థిమాంసము లేకమై, నాల్క వెనుకకీడ్చుకొనిపోయి, హృదయకోశము దడదడలాడి, గుండెలు బరువెక్కి, యూపిరి స్తంభించి, కాళ్లు మెలికలుపడి, నాల్గుదినములక్రిందట నే దా తలయెత్తివాల్చి నేలపైఁ జాఁపచుట్టగఁబడిపోయితిని! నేనుమరణించితినని మీరునిశ్చయపఱుచు కొంటిమని చెప్పితిరి కాదా! మరణించునెడల నాత్మహత్యను బుద్ధిపూర్వకముగఁ జేసియుందునే! మరణింపక యింక బ్రదికియుండుటచేత మఱల నీవుయోగాభ్యాసమే చేయుమనుచున్నావా?

గీ. చచ్చుటయె యోగఫలమైన ♦ జలమునమును
శ్వాసము గుడించి జపమును ♦ జరుపనేల?
చాఁపచాఁతిని మెడకు ము ♦ స్తాబుఁ జేసి
కొనుచు లోఁతుగాఁదనుఁద్రోచు ♦ కొనఁగరాదె?

గీ. పంచవహ్నులనడుమఁ దం ♦ పటినిదన్ను
వేసికొనిమెల్లకునులుచు ♦ వేఁగనేల?
తలగడగనొక్కకొంకచచ్చుఁ ♦ దాఁపుకొనుచు
నొత్తిగిలిపెద్దనిద్దుర ♦ నొందరాదె?

గీ. గొంతుదనుకను బూడ్చించు ♦ కొనుచు మిసుక
నేల? యిలకుంలోఁతునఁగలఁ ♦ వే? శిరంబు
సలువుకొనినపాపం బేమి? ♦ సంప్రపూర్ణ
సిద్ధికిఁకఁ గొంత దిగువవేఁ ♦ చేయరాదె?

కొం—ఇట్టి కర్కశయోగాభ్యాసములు మీరొనర్చియు నిల్లువానిని
నిరసింతురా?

బుద్ధు—గీ. తిననివానికి రుచియెట్లు ♦ తెల్లమగును?
దిగనివానికి లోఁతెట్లు ♦ తెలియఁగలదు?
కననివానికిరూపెట్లు ♦ గ్రాహ్యమగును?
పడనివానికి బాధయే ♦ పగిదిఁదెలియు?

గీ. చదువువానికిఁ గాకయే ♦ సగణిఁదెలియు?
కావ్యగర్భస్థగుణదోష ♦ గణము; మఱియుఁ
గర్తకేకాకపరునికే ♦ కరణిఁదెలియు?
కర్మసవ్యాపసవ్యతా ♦ మర్మకలన.

గీ. చెఱువుపిటికి మఱుగొమ్మ ♦ కరణిగాఁగఁ
గుక్షిపూర్ణత్వగరిమకుఁ ♦ గొంతువలెను
సంపదకుఁగృషిక్రియగ ♦ జ్ఞానమునకు
సంభవమెముఖ్యసాధన ♦ మగుచుగాదె!

కాం—ఈ వేదవిహిత యోగానుష్ఠానములు మీరొక్కరే యాచరింప లేదు. చిరకాలమునుండి యనేకులు మహాదీక్షతోఁ జేసినారు. ఇప్పటికిననేకులు సేయుచున్నారు. వారందఱయనుభవ మొక రీతిగనుండ మీయనుభవమిట్లు విపరీతముగనుండనేల? వారంద ఱు దురభిప్రాయపడినవారై మీరొక్కరు మాత్రము యథా ర్థగ్రాహులై యుందురా?

బుద్ధు—చిరకాలనుండి చేయుచుంటచే విశేషమున్నదా?

గీ. ఊరుఁగాయలు ప్రాఁతవై • యున్నఁగొన్ని
పథ్యవస్తువులగుఁ ద్రాక్ష • పండ్లసార
మెంతముదిపినదుర్గుణ • హీనమంత;
వుచ్చుకొలఁది రేవల్చిన్ని • పొలువుఁగాంచు.

గీ. వయసు ముదిరిన మనుజుని • పడియడంగు;
సర్పవిష వేగమునుగొంత • శాంతినొందుఁ;
గాని తప్పెంత ప్రాఁతదై • నైనఁగాని
తప్పుగనెయుండునిం తైన • నొప్పుగాదు.

అనేకులిట్లాచరించుచున్నారంటివి. అదియుఁగూడ సహజము కాదు.

గీ. తోఁచకొక మేఁక గుహలోన • దూఱ దాని
తోఁకఁ గైకొని గుహ జేరు • మేఁకలన్ని;
కాక మొక్కటినీట ము • న్గఁగ దానిఁ
గాంచి వేన వేల్ స్నానదీ • క్షలను నెఱపు.

గీ. ఖరమొకండు బూడిదెలోనఁ • బొరలదాని
చెలులు భస్మరేఖానము • జ్వాలములగును;
గిడుపుపీఁకుననక్క యొ • క్కటియఱవఁగ
గ్రామమంతయు నోంకార • ధామ మగును.

గీ. మోచనము సేయు వాఁడొకఁ ♦ డాచరించు
వార నేనులు; పొరపాటు ♦ వాఁడు వడినఁ
గోటులకొలందిఁ గుజనుల ♦ గుదుఁ; రోకనిఁవ
మాదమఖిల జీవనగతి ♦ భేదకంబు.

గీ. ఎందఱో యజ్ఞమనుజుల ♦ నెవఁడొ యొకఁడు
విఘ్నఁ కుంచుట యేమియు ♦ వింతకాదు;
తరఁశితిరుగుదని జనులం ♦ దెఱువదింప
నవనిచలియించుననిఁ యొక్కఁ ♦ డనియెఁగాదె?

గీ. గులకఱాల్మెండు; వజ్రాలు ♦ కొలఁది; యబ్ధి
వాలు చిప్పలు కోట్లుము ♦ త్యంపుఁజిప్ప
లరుదు; జనులలోపల మూఢు ♦ లధికసంఖ్యఁ
జెలఁగియుందురు బుద్ధిమం ♦ తులు కొలంది.

కౌం.—హరి హరీ! ఎట్టిమాటలాడుచున్నారు! యోగాభ్యాసపరులందఱు వివేకహీనులేనా? అయ్యయ్యో! పతంజల్యాది వేదర్షులందఱు మూఢులేనా?

బుద్ధు.—

గీ. జనువిమిత్రకోటిని బట్టి ♦ జనునిగుణము,
బాలుర వడత చే గురు ♦ ప్రవరునీతి,
ప్రజలయనురాగమున రాజు ♦ పాలనగతి
నైదికుల బట్టి ఋషిబుద్ధి ♦ పరిగణింత్రు.

గీ. అగమర్షుల కుమతంబు ♦ ననుసరించి
జనులుక్రూరులు భ్రష్టులు ♦ జడులునైరి;
తప్పుదీపముఁగని దారిఁ ♦ దప్పినావి
కులునుడిఁ బడిఱాలను బడి ♦ కూలునట్లు.

కౌం.—అయ్యా! బ్రహ్మముఖోద్ధితములగు వేదముల నేదూరుచున్నారే?

బుద్ధు—సుఖమున్న బ్రహ్మ బుద్ధిలేని బ్రాహ్మణునికంటె ఘనుఁడని నీ యభిప్రాయమా?

కౌం—అయ్యా! నేఁబోయెదను. నాకిఁక సెలవిండు.

బుద్ధు—వెడలనేల? ఇచ్చటనే యుండరాదా?

కౌం—నన్ను నిరోధింపకుఁడు. సెలవిండు.

బుద్ధు—మాతాపితలకు సెలవిచ్చితివా? భార్యాపుత్త్రులకు సెలవిచ్చితివా? రాజ్యమునకు సెలవిచ్చితివా? గార్హస్థ్యమునకు సెలవిచ్చితివా? యోగానుష్ఠానమునకు సెలవిచ్చితివా? వేదాధిక్యమునకు సెలవిచ్చితివా? బ్రాహ్మణాగ్రగణ్యత్వమునకు సెలవిచ్చితివా? బ్రహ్మోత్తమత్వమునకు సెలవిచ్చితివా? నీకుమాత్రము సెలవీయ లేకుందునా? నేఁజెప్పునదేదో యింకఁగొంచెము వినుము.

కౌం—సర్వార్షమతనిరాకరణము సెలవిచ్చియే యున్నారు. ఇంకఁ జెప్పఁ దలఁచినదేమున్నది? ఆర్యమతావలంబకుల నందఱ నొకసారి గొంతుకలఁ గోసి చంపవలసియున్నదని యిఁకనుపన్యసింపఁ దలఁచితిరా?

బుద్ధు—అదిపూర్వమున వేదర్షులు చేసినపనియే. జనులట్లుచచ్చుట కొఱకేయుపవాసములు, యాగములు, ఆసనములు, ముద్రలు యోగములు—

కౌం—అదేపనిగ నట్టిపవిత్రాభ్యాసముల దూఱుదురేల? ఎందఱో యోగాభ్యాసమొనర్చి కృతార్థులైరి కాని, యింతకాలమొనర్చి బాధపడలేక పరిత్యజించి భ్రష్టతనొందినవారినొక్క మిమ్మే చూడవలసి వచ్చెను.

బుద్ధు—మంచిమార్గమును నేను గనిపెట్టుట, దానిని నీవవలంబించుట కొలఁదికాలములో సిద్ధింపవచ్చునుగాన నే నీరీతి భ్రష్టతనొందితిని. నీవీరీతిచూడవలసివచ్చెను. నాభ్రష్టతయెట్టిదో కనిపెట్టితి

వా? చేయుచున్నపని తప్పునిగ్రహించి దానిని వదలివేయుట ఇది భ్రష్టతయో శిష్టతయో. ఇట్టి భ్రష్టుని నీవు నన్నొక్కసినే యేల చూడవలసివచ్చినదన—

గీ. లేమకధికనై పుణ్యంబు ♦ లేమినొక్క
చుఱుకుపాలు హెచ్చు గగల ♦ సువతి నేరు
కొనుచు మార్గమునుగట్టు ♦ కొనిననాథు
గృహమునందుననూతన ♦ గృహిణిచేరి.

గీ. మగనిఁగనిరోన రోసలాడ ♦ మగఁడుమురియు
మిగులఁ గోపింపఁ దలవాంచుఁ ♦ దగనితిట్లు
తిట్టఁజమువును విననట్టు ♦ లట్టియొక్క
ఓయుఁదలుపుమూఁతకయి వీ ♦ క్షించుఁద్వారగ.

గీ. కానుకకుక్త్రిచేఁ జౌర్య ♦ కలననేర్చి
జనులదూషణమున దిద్దు ♦ కొనక ధైర్య
గరిమకు శరీరలఘిమకుఁ ♦ గన్నగాని
వృత్తివంటిది లేదని ♦ యెన్ను జనుఁడు.

గీ. భావవేగమునకు నొక్క ♦ పాయఁద్రావి
ధరను బడి కుక్క, చెవిని మూ ♦ త్రంబువిడువఁ
దను వెఱుఁగకెట్లొలేచి భ ♦ క్తవరుమూర్ఛ
యిద్దిదైవసాక్షాత్కార ♦ మిచ్చు' ననును.

గీ. జనుఁడు బుద్ధిపూర్వకముగఁ ♦ జలువుతప్పు
నొప్పుకొనఁడందులోనేదో ♦ యొప్పుఁజెప్పుఁ;
దనదుతప్పెంత గొప్పదై ♦ తనరునంత
పెద్దతలతిక్కలోఁబడి ♦ వెఱ్ఱినుండు.

గీ. ప్రహారమున కొక్కదుస్తును ♦ వదలువాఁడు
స్వర్ణపాత్రపీటి రసము ♦ వదలువాఁడు

గొప్పవాఁడని యనిపించు ♦ కొనఁడుసుమ్ము
తప్పవదలెడు నాతఁడే ♦ గొప్పవాఁడు.

గీ. ఇష్టలగుపూవు బోండ్లఁగ్ర ♦ హించువాఁడు
మించురుచ్యవస్తువులఁగ్ర ♦ హించువాఁడు
గొప్పవాఁడని యనిపించు ♦ కొనఁగఁదగునె?
యొప్పుఁగ్రహియించు నాతఁడే ♦ గొప్పవాఁడు.

అట్లుగాక నేను నాతప్పొప్పు కొనుటచే నేనెక్కుఁడనై యుంటిని.

కాం.—యోగాభ్యాసమింత కూడనిపనియై యుండునప్పుడు జనులకంద ఱకు యోగులయందీ గౌరవమేల? ఎవరిమాటయో యేల? మీయోగాభ్యాసపటిమఁగూర్చి లోకమం దిప్పటివఱకెంతకీర్తి యున్నది! మీరుమహాత్ములని మిమ్ముఁ జూచుటకెందఱు వచ్చి రిగారు! మీపాదములకెందఱు సాష్టాంగనమస్కృతులు చేయ లేదు? లోకాతీతమగు కీర్తిని సంపాదించినమీరిట్లందు రేల?

బుద్ధు—జనులవాడుకలు యథార్థములగునా?

గీ. అమితసుఖయుక్తుఁడనిరాజు ♦ ననరెమనుజు?
లతనికెటనైనసుఖలేశ ♦ మైనఁగలదె?
అందఱకుఁ బ్రభుఁడనిరాజు ♦ ననరెమనుజు?
లతనికంటెను జనభృత్యుఁ ♦ డన్యుఁడెవఁడు?

గీ. పరులసుఖఘనతలఁగూర్చి ♦ నరులువేందు
నూహములువారి యుపరివే ♦ షోజ్జ్వలతల
గలిగియుంటచేతను సరి ♦ కావు; వారి
మనసులను గన జనులకుఁ ♦ గనులు లేవు.

గీ. చిన్నబొట్టున్న వాని వీ ♦ క్షింపరెవరు
పెద్దబొట్టున్న వాని భా ♦ వింత్రు జనులు;
పిలువఁగనె పల్కువానిని ♦ బెద్దసేయ
రెంతకయినఁ బల్కనివాని ♦ నెంత్రు జనులు.

గీ. తనువుఁగప్పినవానికి ♦ ఘనత లేదు;
గోచిపాతయుదెసమొల ♦ గొప్పయంద్రు
నెత్తివెంద్రుకలున్న నో ♦ రెత్తరెవరు
నేలవెంద్రుకలున్న గ ♦ణింతుజనులు.

గీ. ఇంటఁ గూర్చున్నవాని యో ♦ జింపరెవ్వ
రడవి మిడికెడు వాని నా ♦ హా యటంద్రు;
కాళ్లుతలక్రిందనుండుట ♦ ఘనతకాదు;
కాళ్లుతలపైన నుండుట ♦ గౌరవంబు.

గీ. చాఁపపైఁ బ్రక్కఘనతకు ♦ నంజ్ఞకాదు
శంకుపర్యంకమతిగౌర ♦ వాంక మగును
నింకుకడుపును జనులు గ ♦ణింపకుంద్రు
మందుకడుపును భావింత్రు ♦ మహితమనుచు.

గీ. ప్రకృతి గతి భిన్న మైన యే ♦ పనియు నైన
గొప్ప దానిగ జను లను ♦ కొనుచు నుంద్రు
జనుల హృదయంబు లీడ్చెడి ♦ శక్తి యొకటి
కష్టచయ మందు నిరతంబు ♦ కలుగుఁ గాదె?

గీ. అందు లోనఁ గష్టంబు స్వ ♦ యం ప్రదత్త
మైనయప్పుడు చెప్పెడిదేమి? ♦ అజ్ఞజనుల
కీ స్వతను కృంతకులు మహా ♦ మృతులుగాఁగఁ
బరమదైవంబులుగఁ గానఁ ♦ బడుదు రకట!

గీ. కాని పిడికెఁడుయవలకై ♦ గాత్రమంత
ముక్కలుగఁ గోసి కొనియెడు ♦ మొండిమైన
పరమకష్ట నిష్ఠుర దుష్ట ♦ వరునికంటె
నీమహాత్ములయాధిక్య ♦ మెచటనయ్యా!

గీ. వీరిపంచాగ్ని జపములు ♦ గారడీలొ
నర్చునాగ్నేయ సంస్తంభ ♦ నలకుసరియె?
వీరియనవరతస్నాన ♦ విభ్రమములు
ముత్తెములు దీయు జనునొక్క ♦ మున్కకీడె?

గీ. పలుగుదొమ్మరి పలిటీల ♦ పైనయోగి
వగలముద్రలు దిగదుడ్చు ♦ వైవఁదగదె?
మోటగడసాని కాళ్ల క్రేవ ♦ లాటముందు
బసుగుబాపని తలక్రింది ♦ బెడఁగులెంత?

గీ. ప్రజలముష్టినివర్ధిల్లు ♦ బండవాఁడు;
ప్రజలమూఢత వర్ధిల్లు ♦ బరమయోగి;
జనుల చేమగ్గులను బాడ ♦ సంతసించు;
జనుల చేమోడ్పులను యోగి ♦ సంతసించు.

గీ. కాని, వాఁడూర నుంటచే ♦ ఘనత లేదు;
కాననుండుట నీతని ♦ ఘనతయయ్యెఁ;
గడుపుఁబూడ్చుకొంటనతని ♦ ఘనత లేదు;
కడుపుమాడ్చుకొంటనితని ♦ ఘనతయయ్యె.

గీ. పరులకై శ్రమపడియెడు ♦ వాఁడుఘనుఁడు
తన కితరులకయి పడున ♦ తండు మధ్య
ముండుతనకయియెపడు న ♦ తండు నీచుఁ
డటులిటులుగాని శ్రమమొందు ♦ నతఁడెవండొ?

కౌం—ఇట్లుపయోగింప కుండిన నట్లయిన నుపయోగింపఁకుండునా?

బుద్ధ—అట్లెట్లు?

కౌం—పరమునకు—

బుద్ధ—తెలియనట్టి, తెలియఁదగనట్టియంశము నేలవచియింతువు? కాని నీవనినట్లే—మాటవరుసకు—పరమున్నదనుకొనినను బాపమునకుఁ బరమెప్పుడైన ఫలమగునా?

కౌం——అయ్యయ్యో! పరమయోగులు పాపాత్ములుకూడనా?

బుద్ధు——కారనియెట్లుచెప్పఁగలను?

గీ. పక్షిగ్రుడ్లను దినునట్టి ♦ వాఁడుపాపి
ప్రాణులను జంపితినువాఁడు ♦ పాపతరుఁడు
ప్రజలనే జంపి తినువాఁడు ♦ పాపతముఁడు
తనదుమాంసమె తినుయోగి ♦ తలఁపుమెవఁడొ?

కౌం——నమస్కారము నాకింక సెలవిండు. (పోఁబోవును.)

బుద్ధు——పోయెదవా?

కౌం——యోగాభ్యాసమునఁ బరమపాపాత్ముఁడనగు నేను మీయెదుటనిలువనేల?

బుద్ధు——నేనుగూడ నిదివఱకట్టి వాఁడ నేకదా! అట్టిపరమక్రూరపాపకృత్యమున మనకు గురుశిష్యసంబంధమెటులుండునో, యిఁకముందుజరగబోవు మహాలోకోపకారక పుణ్యకృత్యమునఁ గూడమనమిట్టిసంబంధముననేయుండఁగూడదా?

కౌం——అయ్యా! సర్వసౌఖ్యసంపూర్ణమైన సంసారము నిట్టెపరిత్యజించినారు. సన్న్యాసులై సమంజసమగు యోగాభ్యాసమును కర్కశదీక్షచేఁ జలుపుచు వాని నిట్టె రెండుగడియలక్రిందఁ ద్యజించినారు. పండ్రెండ్రు సంవత్సరములైన సంసారము చేసి విసిగితిరి. కాని యాఱుసంవత్సరములైనఁ జూడకుండఁగనే యపవర్గసాధనమగు యోగాభ్యాసమును వదలినారు. ఇట్లుభయభ్రష్టత నొందినారు. ఇట్టి చలచిత్తుల నెవ్వరుచూచియుండరు! ఇఁకేదోముందుమార్గమనుచున్నారేమి! మీకింకముందు మార్గమున్నట్లు నేననుకొనను. అందులకుఁ వేదశాస్త్రములంగీకరింపవు. ఇఁక మీకున్నది వెనుకదారియే! ఇంత చెడినతరువాత నింకముప్పేమున్నది? ఇహసుఖమైన బూర్ణముగ ననుభవింపక మిడుకనేల? కపిల

వస్తుపురమునకుఁ దయచేసి మహానందమున సర్వసౌఖ్యము లను భవింపుడు.

బుద్ధు—(నవ్వుచు) ముందుదారియు వెనుకదారియుఁ గాక నడుమదారి యేదియునుండఁగూడదా? ఒకని కడుకులు దినుటచేఁ గడుపునొప్పివచ్చినది. లంఘనము చేసిన శాంతించునని యాహారవర్జన మొనర్చినాఁడు. దానివలన గుడురకపోవుటయేకాక వేడిచేసిమఱికొన్ని బాధలు కలిగినవి. లంఘనమువలన నొప్పి శాంతింపలేదు. కానఁ దిరిగిపోయియుడుకులను మునుపటికంటె నెక్కువగఁ దినవలసినదని నీవాఁతనికి బోధింప సాహసింపఁ గలవా?

కౌం—సాహసింపలేను.

బుద్ధు—పోనీ! ఏమిబోధించుటకు సాహసింపఁగలవో యూహించిచెప్పుము.

కౌం—లంఘనమునుమాని లఘువగు నాహారము నేదో పుచ్చుకొనుమని చెప్పుదును.

బుద్ధు—అనఁగ—కఠినాహారమువలన వ్యాధివృద్ధియగుననియు, నిరాహారతవలననుష్ణతావృద్ధియగుననియుఁ దెలిసినది కావున నేకద!

కౌం—ఆ.

బుద్ధు—ఆహారణవృత్తికి మొదటిదియగు నమితాశనము తుదిదగువనశనముకూడ వర్జింపవలసినవేకదా!

కౌం—ఆ.

బుద్ధు—ఎందుచేత?

కౌం—దుఃఖహేతువులగుటచే—

బుద్ధు—సరే—వానినివర్జించి?

కౌం—మధ్యమార్గమునననుసరింపవలయును.

బుద్ధు—ఎందుచేత?

కాం.—సుఖహేతువగుటచేత—

బుద్ధు—ప్రమాద శూన్యత్వముకల యీమధ్యమార్గముననే జనుడవలంబించునెడలఁ గడుపునొప్పి కానియత్యుష్ణత కానికలిగియుండవు కద!

కాం.—ఔనవును.

బుద్ధు—అటులైనఁ జెప్పెదవినుము.

ఆ. వె. ప్రభువు తలకుచుకుట ♦ వహనకష్టంబెంతొ
జడలభారమంత ♦ సంయమికిని
బతికి మిగులతిండి ♦ వలనవేదనయెంతొ
యనశనమునఁ యోగి ♦ కంతబాధ.

ఆ. వె. ధనపురాశిచేన ♦ తనిగుండెబరువెంతొ
తపముపోవుననియి ♦ తనికినంత
హంసతూలమృదుత ♦ నతనికెంతశ్రమంబొ
యిలనుఱాల్రపక్క ♦ నితనికంత.

ఆ. వె. ఆశ్రితాళి పీకు ♦ లాటయాతనికెంతొ
వీని కంతమెకవుఁ ♦ బీకులాట
పలువు రబల లిచ్చు ♦ బాధయాతనికెంతొ
వీనికగ్నిమధ్య ♦ వేధయంత.

ఆ. వె. త్రాగు డెక్కుడగుటఁ ♦ దాపమాతనికెంతొ
యెండనపుకునిలువ ♦ నితనికంత
నోరుతెట్టవలని ♦ నొప్పియాతనికెంతొ
ముక్కుమూతనితని ♦ ముప్పునంత.

ఆ. వె. తగని స్వేచ్ఛవలని ♦ తెగులాతనికెంతొ
స్వేచ్ఛలేనియేదు ♦ పితనికంత
కడుపుకాల్లనంటు ♦ గాసియాతనికెంతొ
వెన్నునంటువెతయు ♦ వీనికంత.

ఆ. వె. సతతరోగబాధ ♦ సతనిదుర్గతియెంతో
సతతయోగబాధ ♦ నితనికంత
చావుభీతినతని ♦ సంభ్రమంబెంతయో
బ్రదుకుభీతినితని ♦ పాటునంత

ఆ. వె. సుకముమిగులహెచ్చి ♦ ప్రకటకష్టంబగు
నదియెతగ్గి కష్ట ♦ మగును మఱల
జనునితనువు కాక ♦ ఘనమాచమృతి నిచ్చు
నదియెతగ్గి చావు ♦ నందఁజేయు.

ఆ. వె. ఉభయ దిశల గష్ట ♦ ముందుసౌఖ్యమునకు
నదియెనడుమఁజేరి ♦ యగునుసుఖము
బాధసుఖమునొకటి ♦ వస్తునైజమునను
గలిసిబట్టె భేధ ♦ కలనకలిగె.

ఆ. వె. ఇష్టసుఖములన్ని ♦ యెటులైనగ్రహియింప
వలయుననెడి మతము ♦ పనికిరాదు;
తడిసియొడిముక్కు ♦ ముడిచి మాడిపొడుమై
మడియుమనెడుమతము ♦ పెడమతంబు.

ఆ. వె. ఏతదుభయమతము ♦ లిర్వుపక్కగుఱ్ఱులై
తోఁపనడిమిదారిఁ ♦ ద్రొక్కవలయు
మెఱకతెలియ నీటి ♦ గుఱుతులనడుమను
బాయ తీసివెడలు ♦ పడవపగిది.

అట్టిమధ్యమార్గమేదో లోకోపకారార్థమై కనిపెట్టవలసియున్న
ది. కనిపెట్టుటయు దుస్సాధ్యము కాదనితోచుచున్నది. కానీ

వుకూడనవృథాశ్రమమందక యోగమును మాని యాలోచించు
చు నిటనుండరాదా?

కాం—తమమాధ్యమిక మార్గముభయభ్రష్టత నొందినవారి కెవరికైన నక్కఱకు వచ్చునులెండు. సే బోయెదను.

బుద్ధ—నాయనా! నీకింకయాధార్థ్యము పొడకట్టకున్నదని నాకు విచారమున్నదిసుమా?

కాం—కేవల మసంబద్ధమగు నయథార్థము మనసునఁ బట్టుటకంటె యథార్థముపొడకట్టకుండుట మిగుల విచారకరమగు నాపదగాదు లెండు. మీగురుత్వమునకు, మీకు, నమస్కారము. (పోవును.)

బుద్ధ—యోగము వదలినట్లే శిష్యుఁడుకూడ వదలినాఁడా?

గీ. సిలుగులఁ జెలఁగియున్నట్టి ♦ చీనపథము
మంచిదని దానివదలరు ♦ మనుజులెవ్వరు
దోషరహితంబునైననౌ ♦ ఘుని క పథము
తప్పు తప్పు మూఁడవసారి ♦

గీ. కనిసకారణముగదోష ♦ మనివచింవ
మంచిదే! యట్లుకాకయో ♦ జించకుండ
దప్పనఁగనట్టి తప్పుక్రొ ♦ త్తదగుబాట
తప్పు కాదు; మూఢులనోటి ♦ తప్పుకాని.

గీ. ప్రాతక్రొత్తయువస్తువి ♦ భాగముగునె?
కాలగతిభేదకలనయే ♦ కాని క్రొత్త
దైనయది ప్రాతకాకుండ ♦ నట్లెయున్నె?
ప్రాఁతయది క్రొత్తగాకెట్లు ♦ ప్రాఁతదయ్యె?

గీ. ప్రకృతిశాస్త్రజ్ఞులకుఁ గవి ♦ వరులకుమత
బోద్ధలకు వారితిట్లును ♦ బోట్లుతప్ప
వట్టివారి యజ్ఞానంబు ♦ నపహరింపఁ
బాటుపడుటలుతప్పవు ♦ ప్రాజ్ఞులకును.
అదిగో! సూర్యాస్తమయ సమయమైనది.
గీ. కొండచిలువమేల్కని యొడ ♦ గ్గొలుకుకొనును;
గొంతుకను నక్కసవరించు ♦ కొనఁగసాగె
ఋషియు ఋషిపక్షిసెలయేటి ♦ కేగినారు
ముచ్చటకు గ్రుడ్లగూబదో ♦ బుచ్చియాడె.
ఏవైననృక్షచ్ఛాయకుఁ బోయి యచ్చట రాత్రిగడపెదనుగాక!
(బుద్ధుఁడు నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.





# బుద్ధబోధసుధ.



## ద్వితీయాంకము.



[ప్రదేశము—గయ—మఱ్ఱిచెట్టుక్రింద.]

(ప్రవేశము—బుద్ధుఁడు.)

బుద్ధు—ఆహా! ఆహా! ఎచ్చటనది లేనితావుకనబడదుగదా!

గీ. తల్లి దిను వింతలగు సూడి ♦ దలఁచఁగల్గు
పులుసు కారంబు చే గర్భ ♦ పోత మెంత
తల్లడిల్లునో గద! యుష్ణ ♦ తా ప్రతప్త
మగుచుఁ గొట్టుకొనుచు నేమి ♦ యగునొ! కట్ట!

గీ. వెలుపలికి వచ్చు నపుడు నా ♦ భిస్థ నాళ
మఱ్ఱ ననుజిక్కి యుక్కిరి ♦ బిక్కిరి యయి
చచ్చు నంతకు ముందుగాఁ ♦ జావకున్న
వెలిబడిన వెంటస్థితి భేద ♦ ములను జచ్చు.

గీ. చేటఁ బడినప్డు చాకున్న ♦ శిశువు మొదటి
కార్యమేమగుఁ తరువాతి ♦ కార్యమేమ్మ

చచ్చు వఱకుఁ జేసెదు ప్రయో ♦ జకతయేద్వె
తమేద్పుతోఁ బుట్టి చచ్చెను ♦ నేద్పుతోడ.

సీ. మందాగ్నిఁ బొందున ♦ మందార్తి నొక్కఁడు
తప్పిరిచే స్పృశ ♦ తెలియఁ డొక్క
డుబ్బ జబ్బునఁ జాలఁ ♦ దబ్బిబ్బగునొకండు
పురుష గర్భంబునఁ ♦ బొక్కు నొకఁడు
పక్షవాతమున సాఁ ♦ బాలుచచ్చునొకండు
చచ్చువాతమునఁ బా ♦ షాణమొకఁడు
కానగాసినిగుల్లి ♦ కాంక్షించునొక్కఁడు
పెడతూలచేనొంద్ర ♦ పెట్టునొక్క.

గీ. డుబ్బసంబునఁ గప్పలా ♦ గొదిగిపండు
కొనుచు నెగయూపిరిని గెక్కు ♦ మనుచునడరు
బ్రక్కచేరులు బిగబట్టు ♦ బాధవలన
నఱచుఁ దిర్యఙ్ముఖత గడ్డి ♦ గఱచియొకఁడు.

సీ. పుట్టైమూదను మొట్టో ♦ మొట్టోయనునొకండు;
చెవి గునపపుఁబోటుఁ ♦ జెందునొకడు
కంటిమంటలకుఁ మి ♦ న్నంటి దొరునొకండు
ముక్కురక్తపుఁగాల్వఁ ♦ బొగులునొకఁడు
గొంతుపూడ్పునుపోర ♦ కోఁతనేడ్పునొకండు
రాచపుండునసొడల్ ♦ రగులునొక్క
డాంత్రనాళ స్థ్రవ ♦ ణార్తినొందునొకండు
వింటిదొమ్మనుమొగ్గ ♦ వేయునొకఁడు.
బోదకాళ్లసంకెలలను ♦ బొరలునొకడు
మూలరోగముతోఁ జెడ ♦ మూల్గునొకఁడు
నక్కమోమునబడఁగూసి ♦ నవయునొకఁడు
కుష్ఠమున బురుగులుపడఁ ♦ గూలునొకడు

గీ. సతికి నివియన్ని యేకాక ♦ జననకోశ
మధికముగ నుంట ఋతుశూల ♦ యద్భుతంపు
మూర్ఛ ప్రసవార్తి సూతిక ♦ మొదలుగల్గు
వ్యాధులన్నియు నామెపా ♦ లయ్యె నకట!

గీ. ఆలితలపోటునకు దేవు ♦ లాఁడుమగఁడు
మగనిలోలొటారమునకుఁ ♦ మగువ యేడ్చు
గొడుకుసన్నిపాతమునకుఁ ♦ గుందుఁ దండ్రి
తండ్రి యంధతావస్థకుఁ ♦ దనయుఁ డేడ్చు.

ఇంతయేకాక స్త్రీపురుషునకుఁ బురుషుఁడు స్త్రీ కిచ్చువ్యాధు లమితములై వానిమహా ఘోరఫలము జగత్తున దట్టముగ వ్యాపించి యున్నది. ఇదియుగాక —

గీ. కాలియడుగునఁ బల్లెరు ♦ కాయపోటు
బ్రహ్మరంధ్రమునకునెక్కు ♦ బ్రక్కనల్లి
కాటుతైతక్కలాడించు ♦ గర్ణములను
దోమమేల్కొల్పులకుఁ జిక్క ♦ తోఁడసురటు.

గీ. కొండిఁ బ్రేటువఁ దేలట్టె ♦ గుండెగరిస
లంబడఁ జేయును; బాము సై ♦ లవినిజాఱు
నొకవిషాల్పబిందువునోటి ♦ నుండి యుబ్బ
లుబ్బలుగఁ గడతెంచు చొంగ ♦ లుబ్బఁ జేయు.

గీ. అక్షినణువైన హృదయాశ ♦ ల్యాముగు; వెఱ్ఱి
కుక్కకఱచిన నరుఁడు నా ♦ ల్గు పదములను
పరుగులిడుఁ; గఱచుచు; మింటి ♦ వంకమోర
వెట్టియేడ్చు; సిరుకతను ♦ బిట్టు మొఱుఁగు.

ఇదికాక —

గీ. ఒక్కభూకంప మెన్నిపు ♦ రోత్తమముల
గోఁతఁబెట్టువీరాంగవు ♦ మ్రోఁతఁ యగ్ని
శైలకోలాహలము ప్రాణి ♦ జాలసంఘ
దహన సంస్కృతి కపనమం ♦ త్రములరువ్వ.

గీ. కొలఁది మట్టికిఁబసవుఁను ♦ కుక్కనకు నాసఁ
జెందిజనకోట్ల కుత్తుకల్ ♦ జెండిశారి
పలలములను రాచ కసాయి ♦ పందలమ్మఁ
బెట్టుసంతలు యుద్ధ ప్ర ♦ ధ్వస్థలములు.

ఇట్టియసంఖ్యాకములగు బాధలు జనులకు సామాన్యముగ సిద్ధించునవైయున్నవి. ఇఁక నొక్కొక్క జనునకు బాల్యయౌవన కౌమారవార్ధకములఁ గలుగు బాధలెట్టివో కొంచెము యోచింతము. ముందు బాలునియవస్థ——

గీ. పాఠశాలకేగకగాది ♦ ప్రక్కడాఁగు;
సీడ్చుకొని పోవ లబలబ ♦ నేడ్వసాగుఁ
జమువుమనశిరోవ్యధచేతఁ ♦ జాలమూల్గు;
కొట్టగురుశిట్లు త్రాటి యా ♦ కుననుగోఁణఁగు.

గీ. చదువుకొనకుండఁ దల్లికి ♦ సాయపడుచు
నింటసుఖమున్న చెల్లెలి ♦ నంటియాఁడు
పుట్టువునఁబుట్టకిటు లేల ♦ పుట్టినాఁడఁ
జమువుఁబోలు మహాపద ♦ జగతి నేది?

గీ. నిశిని బసిలోన నెట్టుకో ♦ నిప్పుపుట్టి
పుస్తకములతో బుగ్గియై ♦ పోవరాదె?
మాఁగినోదొమ్మనొగుదుఁడు ♦ మడఁగిపోవ
కేలయీ మొుఁడి బ్రదుకని ♦ బాలుఁడేడ్చు.

గీ. ధనయుతుని బిడ్డమెడరత్న ♦ దామముఁగని
తనకు లేదని సామాన్యు ♦ తనయుఁ డేడ్చు;
నితనిబుగ్గ గులాబికై ♦ యతఁడు పొగులుఁ
గటికి బీదబిడ్డఁ డుభయ ♦ గతుల కేడ్చు.

గీ. ఆటఁదనకంటె నొకఁడు పై ♦ యాడెననుచు.
మఱిగియాతని దిట్టుఁదో ♦ మ్మొగి, యటంచు;
విద్దెనొక్కఁడు దనకంటెఁ ♦ బెద్దయనుచుఁ
గుమిలి చెడఁదిట్టు పుస్తక ♦ క్రిమి యటంచు

గీ. తనుఁగని యొకఁడు నవ్వలే ♦ దనుచు నేడ్చుఁ;
దనుఁగనుచు నితరుం డేడ్వ ♦ ననుచు నేడ్చుఁ;
దనుఁబొగులఁగఁ బరుఁడు నవ్వ ♦ ననుచు నేడ్చు;
నొకఁడు కొంచెమేడ్చెనని మ ♦ ఱొక్కఁ డేడ్చు.

గీ. ఒకఁడు మఱొకఁడని వేఱొక్కఁ ♦ డుడికి యేడ్చు;
నతిముదమున మఱొకఁ డేడ్చు ♦ నితరుఁ డేడ్వ
నొక్కఁ డేడ్చు; నేడ్వఁగ హేతు ♦ వొక్కటైనఁ
గానఁబడరాదని మఱి యొ ♦ కండు నేడ్చు.

ఇఁక యౌవనావస్థనున్న వాఁడెట్టి కష్టములందునో యించుక యోచింతము.

గీ. ఉవిదప్రక్కలోనికి రాక ♦ యుండునపుడు
సతతకాంతాభిలాష చే ♦ సంభ్రమించుఁ;
గడల ద్రొక్కక దాస్పహా ♦ కష్టమొందు?
విడివడుచుఁ గడునిడుములఁ ♦ గుడిచి యేడ్చు.

గీ. క్రొత్తపెండ్లికొమరితతోఁ ♦ గులికి కులికి
మరులు తలముస్కలుగఁ దాప ♦ భరమునొందు
నింద్రధనువు చిత్తమునుండి ♦ యెగిరిపోయి
విసుగు బట్టబయల్గాఁగ ♦ వెతఁదపించు.

గీ. ధనికి నెవనికో మగలంజె ♦ తనమునంధుఁ
దనుఁబఱచుకొని యతని సం ♦ తసము కొఱకు
నెన్నొ మాయవేసములేడ్చి ♦ యీడ్గిలఁబడి
యాత్మమానవిక్రయఫలం ♦ బార్తిగుఱుచు.

గీ. ధనిమఱొకమగగుడిసె వ్రే ♦ టునుగని నగఁ
డనదు మీసాలసవతికై ♦ తాఁదపించు
వింతసాపత్న్య కలహంబు ♦ వృద్ధియగును
జనులువీరి త్రోపులసంద ♦ డిని నశింత్రు.

గీ. అట్టినత్తిపాగాల యి ♦ ల్లాండ్రనడుమఁ
బీఁకులాటలఁ బడలేక ♦ విభుఁడునేప్పు
సందఱిను మేళముగఁ గూర్ప ♦ నతనియోఁపు
పందలును గజ్జెఁగట్టఁగ ♦ నందజేఁప్పు.

గీ. కుంజరము బలాత్కృతిచేత ♦ గోలఁబడును;
పక్షి మోసపెట్టఁబడుచు ♦ వలనుబడును
గానికలము బందమెఱఁగి ♦ కట్టుకొనెడు
వాఁడొక జనుండు తక్కనే ♦ ప్రాణిలేదు.

గీ. కానియొకని సొమ్ము హరించి ♦ కాళ్లకినుప
సంకెలలఁ దగిల్చికొను త ♦ స్కరుని కంటె
వానిగౌరవమేమి? యు ♦ భయులితరధ
నహారులును సిగ్గఁడులు నుప ♦ గ్రహులు కారె?

గీ. ఇనుప బంగారు సంకెళ్ల ♦ నేమిభేద
మగును? దినునది దెబ్బమై ♦ యట్టుమాడ్పు
నప్పుడు కొరడకట్టియబోడి ♦ దైననేమి?
యందమగుకుందనపుఁబొన్ను ♦ దైననేమి?

కాని—

గీ. కారఁగలదొంగ నిర్భీతి ♦ నోరు దెఱచి
ఘుష్టగతిఁబల్కఁగాఁగల ♦ డితఁడొ నోరు
గట్టుకొనవలయుఁ; గనులు ♦ గట్టుకొనవ
లయును; బిద్దెకొట్టు కొనవ ♦ లయును జెవులు.

గీ. స్వేచ్ఛకై బొండమూరి కృ ♦ శించు, సుఖముఁ
గోరి దుఃఖ మొందుఁ, మహాధి ♦ కారమాస
పడుచుఁ జచ్చు బానిస క్రింద ♦ బానిసయగుఁ
జేరుఁగోరి తిట్టులు లెంప ♦ పెట్టులొందు.

గీ. తలఁచిన సుఖంబు దొరకమి ♦ తల్లడిల్లి
కొసకు దాని గల్పిద్దెనో ♦ కులటముద్దు
నో దెమకి కొనలేక మొ ♦ ఱ్ఱోయటంచుఁ
బడసలెఱచి గొంతుగుండెయుఁ ♦ బగిలిచచ్చు.

ఇఁక కౌమారావస్థవఱకు నిలిచియున్న జనుఁడు సామాన్యము
గ నేవిపత్తుల నొందునో చూతము.

గీ. కంటమందేడు; మందాగ్ని ♦ కడుపునందు;
నింటబిడ్డలగీరుగా ♦ డింటిబైట
వడ్డికై కోఁత; కాళ్లదు ♦ ర్భరపుభవభ
రంపుసంకెళ్లమోఁత; లోఁ ♦ బ్రాణికోఁత.

గీ. సంతు లేదని యొకఁడేడ్చుఁ; ♦ చాలుబిడ్డ
లంచు నొకఁడేడ్చుఁ; బిల్లల ♦ వ్యాధులకయి
యొక్కఁడేడ్చు; శుంఠత కేడ్చు ♦ నొకఁడు దుష్ట
తకు నొకండేడ్చుఁ; గడుపుకోఁ ♦ తకొకఁడేడ్చు.

గీ. సతి కెపుడు రోగమని గండ్ర ♦ సంతపించు
నెపుడు రోగపడదటంచు ♦ నేడ్చుబక్క

సతిమడిసెనని సంసారి ♦ వెతనుజెందుఁ
జావదని పెఱిగుళ్లఫూ ♦ జరితపించు.

గీ. పడతిమైనపుడిమ్మయం ♦ చదరునొకఁడు
కండిరీఁ గయును చొకఁడు ♦ కుందుఁజెందు
నంటకుండ ఆఁచిప్పయం ♦ చదరునొకఁడు
సీతకోకచిల్కని వెతఁ ♦ జెందునొకఁడు.

గీ. వనిత తన్నెష్ట కనిపెట్టు ♦ కొనుచునుండు
ననుచునొకఁ డేడ్చు నెడమొగి ♦ మూను పెడమొగ
మంచమొక్కఁడేడ్చును వీథి ♦ యరుగుమీఁద
వాఁమె, యింటఁదానని యొకఁ ♦ డార్తిఁజెందు.

గీ. ఒడలి బలముడిగిన వెన్కఁ ♦ గడుపునించు
కొనుటయెట్లని యొకఁడేడ్చుఁ ♦ గొమకులుతన
పిల్లె సానులబంగారు ♦ గుల్లలకును
వల్లెలకునిత్తురని వంతఁ ♦ బడునొకండు

గీ. ధనము లేదని యొకఁడేడ్చు ♦ తినఁగ లేక
యొక్కఁడేడ్చు; దాచఁగ లేక ♦ యొక్కఁడేడ్చు
నీయ లేక యొక్కండేడ్చు ♦ నింతకంటె
నొకని కెక్కువగలదని ♦ యొక్కఁడేడ్చు.

గీ. ధనముతగినంత లేదని ♦ త్యాగియేడ్చుఁ
బెట్టువానిఁ గాంచిపిసిఁడి ♦ తిట్టియేడ్చుఁ
గృపణుఁగని యర్థియేడ్చు దు ♦ మ్మెత్తితిట్టి
నర్థియర్థ్యంతరునిగాంచి ♦ యార్తిఁజెందు.

గీ. కొలఁది మెతుకుల కెంగిలా ♦ కులకుఁజుట్టు
గుక్కలు వెఱమొఱిగి పీకు ♦ కొనుచుఁ గఱచు

కొనునుగాని రాజోచ్ఛిష్ట ♦ మునకుజనులు
ప్రాణములఁ దీసికొందు రే ♦ మనఁగవలయు.

గీ. ధనముగలతండ్రిచావలే ♦ దనుచుఁ బనుచు
తనయుఁడు కృశించుఁ బెట్టని ♦ తనయుఁ డేల
యనుచు జనకుఁడు శపియించు ♦ ధనపుబాళ్లు
తెగక భ్రాతలు కుత్తుకల్ ♦ తెగుదురకట!

గీ. ధనముపాతఱవేసియ ♦ ద్దానిమీద
ననశనముగ నొక్కఁడుపడి ♦ వనటజెందు
సఖినిగదిమూసిసుఖియింప ♦ శక్తి లేక
ద్వారమునఁ గాపువడియేడ్చు ♦ వేఱొకండు.

గీ. కడుపుకకుర్తి గలుగని ♦ కష్టజాల
మభినయమొనర్చి బీదమ ♦ హార్తి నేడ్చు
సుఖియనెడుకీర్తికైయెన్ని ♦ సొగసులెన్ని
వగనగవులేద్వలేకసం ♦ పన్నుఁడడరు.

గీ. పంటిపోటున నొకఁడేడ్చు ♦ పరునిగతికి
కంటిపోటుననొకఁడేడ్చు ♦ కంతుతుంట
వింటిపోటుననొకఁడేడ్చు ♦ వ్యర్థమైన
పగ జెముడుముంటిపోటున ♦ పొగులునొకఁడు.

గీ. అస్రపటిమతగ్గినదని ♦ యడరునొక్క
డాసపీడహెచ్చగుటనూఁ ♦ గాడునొకఁడు.
చౌరవపురి పీడెననిగాసిఁ ♦ బొరయునొకఁడు
శంకముప్పిరిగొ గిజగి ♦ జబకునొకఁడు.

గీ. చెడితిరిగియండవాతము ♦ గడనఁ జేసి
కుజుఁడొసగినముల్లెయిదని ♦ కుందునొకఁడు;

తప్పుదారులధనమంతఁ ♦ దగులఁబెట్టి
జన్మశనికో సెగొంతని ♦ సణఁగు నొకఁడు.

గీ. పెదవిపైఁగొక్కుకొఱుకనో ♦ క్రొమ్మదపలేని
కోరలమ్మతనదుపుత్త్రుఁ ♦ గొఱికెనని య
డరు నొకఁడు; మూత్రమునబాయి ♦ దొఱుఁగఁగాని
వానిచేవిసరని బెంగ ♦ పడు నొకండు.

గీ. ఒకఁడుబుద్ధిలేదని యేడ్చు ♦ నొరులుధీర
హితుఁగఁదన్నెంతురనిమఱి ♦ యింత యేడ్చు;
నొరులుధీమంతులనిమఱి ♦ మఱియు నేడ్చు;
నేడ్చువనియొరులెంతురం ♦ చెపుడు నేడ్చు.

గీ. తనయిడుములకేడ్చు నొకఁ; డి ♦ తరులకిడుమ
లొనరలేదని చెడనేడ్చు ♦ నొరులకష్ట
ములకునవ్వ లేకమఱేడ్చు ♦ ముందుగష్ట
చయము వచ్చునేమోయని ♦ చాలనేడ్చు.

ఇఁక వార్ధకావస్థనున్న జనులకష్టము లెట్టివొ చూతము.

గీ. బలముడిగిపరాధీనుఁడై ♦ వనరు నొకఁడు;
చేయియెత్తుపుత్త్రులుచావఁ ♦ జెడు నొకండు;
పొట్టకూటికేకలవుగాఁ ♦ బొక్కు నొకఁడు;
కొడుకులాదరింపరటంచు ♦ మిడుకు నొకఁడు.

గీ. ఆవులింతలెకానిక ♦ న్నారనిద్ర
కలుగదనియేడ్చు నొక్కఁడు ♦ కడుపులోనఁ
ద్రాటియాకుమంటయెకాని ♦ నోటికేది
పోదటంచు నొక్కఁడు నెత్తి ♦ మోదుకొనును.

గీ. కనఁదలఁపె కానికనులు లే ♦ వనుచు నేడ్చు;
వినఁదలఁపె కానిచెవులు లే ♦ వనుచు నేడ్చు;

నమలమతికానిపండ్లను ♦ న్నయనియేడ్చు;
లేవమతికానికాళులు ♦ లేక యేడ్చు.

గీ. కుళ్లుదగ్గునఁగాండ్రించి ♦ కుందు నొక్కఁ
డించుకకఫ మారఁజెడగొం ♦ డ్రించు నొకఁడు;
పొణ్ణిదయినకాసచేలంకె ♦ లిడుముట్లొక్కఁ
డస్థుపముకళ్లెఁగ్రిందుమీఁ ♦ దగు నొకండు.

గీ. కుంపటికినిలొంగనిచలిఁ ♦ గుందు నొకఁడు;
మందునకునుదీఱనిరుజ ♦ మఱుగు నొక్కఁ;
డొలిమికినాఁగనివగను ♦ దొరు నొక్కఁ
డేడ్చునసుదీఱనిమహార్తి ♦ నేడ్చు నొకఁడు.

గీ. చావురాదని పైకేడ్చుఁ ♦ జత్తుననుచు
లోనుదుకుఁ జత్తువనిఁ యెవఁ ♦ డైన ననిన
నిల్లెగిరిపోవఁగానేడ్చు ♦ నేడ్వ నేల
యనిననీవు చావుమనియొం ♦ తయిన నేడ్చు.

గీ. నాకు నేదియు వలదని ♦ పైకిఁ బలికి
నన్నియును లోనఁ గావలె ♦ ననుచు నేడ్చు
నెదియుఁబోయిన నాకేమి ♦ కొదువయనుచుఁ
బొడుముకాయ బిరడవ్రొవ ♦ మొత్తుకొనును.

గీ. తపనుపడుచుదాయాదులం ♦ దఱుగతింప
వారిదంతయుఁ దనుజేర ♦ వలయుననుచు
నుబ్బసప్రుఁ బిల్లికూతల ♦ నొక్కుమనుచు
మూలమూల్గులమరిడమ్మ ♦ మ్రొక్కులిడును

గీ. అందఱును దన్నుఁదిట్టుచు ♦ తనుచునించి
యుందఱను దాను జెడదిట్టి ♦ యార్తిబడును

బట్టతలగోకుపౌత్రుని ♦ గొట్టకట్టి
వెదుకబోయి కుంపటిఁ జేయి ♦ వెట్టియేడ్చు

గీ. చీములును దోమలీఁగలు ♦ చేరియొడలు
పీకగా బాపుకొనలేక ♦ వెతనుగుడుచు
మత్సరక్రోధలోభముల్ ♦ మనసు నెపుడు
కాలుకగా శాంతిపడలేక ♦ మఱిమఱేడ్చు

గీ. తనువునను నెత్తురుపొగరు ♦ తగ్గియున్న
శ్లేష్మపుఁ బొగకుచేఁ గాకఁ ♦ జెందిమఱుఁగు
నరములకు బింకమగుపట్టు ♦ దొరగియున్న
బెంకి మొండిపట్టునబిట్టు ♦ బిగిసిపోగులు.

గీ. ఎడమప్రక్క సమ్మెటదెబ్బ ♦ వడియఁడంగఁ
గాలిమితిత్తుల బుస్సుబు ♦ స్సులకుఁబొగులు
నుదరమునవత్తికునుకుచు ♦ నున్న బసఁడు
మంటచేఁబ్రమిదంతయు ♦ మండనేడ్చు.

గీ. నెత్తిపైనాకు రాల్కారు ♦ నేత్రములను
శ్రావణము ఘ్రాణపదమును ♦ రసనయందు
మందు వేసవి; కోసలహే ♦ మంతమాశ
యందునవసంతమైయార్తి ♦ నందునెపుడు.

గీ. దగ్గు తెమలకయొక్కఁడు ♦ త్రోఁగఁగఁబొర
పడియొకడుకోపమునఁ గేక ♦ లిడఁగనరము
లెగియొకఁడుపదిదినములు ♦ దిగువప్రక్క
కండచీములుపీఁకనె ♦ క్కండుచచ్చు.

గీ. పుత్త్రతతితండ్రియంచేడ్చు ♦ ముసలిమేన
యత్తయూఁగాయలుమైల ♦ యయ్యెననుచు

నేప్పుతారత్రిపాదియం ♦ చేడ్పుబావ;
తెల్పుతనమీాశనియెప్పు ♦ దాపువాఁడు.

గీ. బాటగంగాధరుఁడుమైల ♦ పడితివనుచుఁ
బ్రాహ్మణనెచావకేలని ♦ పొరుగువారుఁ
ద్వాంగ ముగిసినమనమైన ♦ బ్రదుకుదుమని
యుందఱునుగుందుఁ జెందుచు ♦ రచటనకట!

గీ. ఆర్ద్రవానస్నులద్వాయ ♦ ప్రాశనములు
మృత్తికాస్నానదీక్షలు ♦ మృతకములును
దర్పణములును బిండప్ర ♦ దానములును
మాక్షికము లాబ్ధికములంచు ♦ మఱియుమఱియు.

గీ. బ్రాహ్మణస్వార్థపరచక్ర ♦ వర్తి రచిత
మంత్రతంత్రరూపక బహు ♦ మార్గగోహి
రణ్యాతతిసమాకర్షణ ♦ ప్రస్ఫుటేంద్ర
జాలమునఁ బడికర్తవి ♦ చారమొందు.

సీ. పుడిసెడునీళ్లతోఁ ♦ బిడికెడుతిలలతో
బోడిదాన్నెనుదర్భ ♦ పుడకతోడ
ముళ్లువెట్టిననూలు ♦ పోఁచతోముకుపాడి
చిటికంతగోమయ ♦ ఘుటికతోడ
బూడిదపండ్లంత ♦ మూడుముద్దలతోడ
లోడలోడ మనునోటి ♦ బుడగతోడ
నట్టివానిని ముక్తి ♦ కెగరవైచెదుద్విజుల్
గురుతరాఖిలదేశ ♦ గురులుగాఁగ
భరతవర్షదుర్గతియెంతో! ♦ ప్రాణికోటి
పాపమెంతో! బానిసక్రింద ♦ బానిసయగు
పాడుభగవంతు దౌర్భాగ్య ♦ భారమెంతో!
చెప్పనననేమి? తలఁపను ♦ జేతఁగాదు.

గీ. అర్భకశిరోదయంబగు ♦ నవుకుమంత్ర
సానికంటె మేషవృషభ ♦ శాస్త్రిముందు
స్త్రీలమూర్ఛకు వైద్యాని ♦ సేవబిరడ
కంటెమాంత్రికుఁ గోరడమె ♦ కాదెముందు.

గీ. బుట్టగీయించవలసి న ♦ ప్పుడును గీత
కత్తికంటెఁ బాచాఁగవుఁ ♦ గట్లముందు;
పెండ్లిలోఁ బున్గులును బూల ♦ చెండ్లకంటెఁ
గుండలగ్నులు కుశలు మూ ♦ కుల్లముందు.

గీ. పతికిఁ బ్రథమగర్భాధాన ♦ సమయమందు
వరునికంటెఁ బురోహితు ♦ వరుఁడుముందు;
విందులన్నిటిలోఁ బెద్ద ♦ పీటలందు
వియ్యమునకంటె ముత్తుల ♦ పెయ్యముందు.

ఆహా! ఇదేమి? అవస్థాచతుష్టయమునందు కష్టముల నాలోచించుచు నిట్టె బ్రాహ్మణాధికమాహాత్మ్యమును గూర్చి యాలోచించు చుంటిని. కడుపులో భూకంపమువలె నున్నది. లోపలియఁలజడియే కాని పైకేది రాకున్నది.

గీ. నోరుచిన్నతలఁపు లొక్క ♦ సారియన్ని
పైకిరానెంచు నైనఁబైఁ ♦ బడదొకటియుఁ;
బొట్టలావునుమెడసన్న ♦ ముగలకుప్పె
కుదిపిఁబోర్లింపలోమందు ♦ ఘుటికలట్లు.

ఇప్పుడెక్కడ నుంటిని? ఎక్కడఁజూచినదుఃఖమే! ఎక్కడఁజూచినదుఃఖమే! ఈమహాదుఃఖము లూరకే యనుభవించుచు నుండవలసినదేనా? వీనినుండియెన్నఁటికైన విముక్తికలదా? బ్రదుకంతయుఁగష్టమైనప్పుడు బ్రదుకనేల? బ్రదుకనేల యని యాత్మహత్యచేసికొనవలయునా? ముందుజన్మమే యుండునెడల నాత్మహ

త్యవలని ప్రయోజనమేమి? కావుననీజన్మముననే దుఃఖశాంతి యవశ్యకర్తవ్యము. దుఃఖమునంభవించునపుడెల్ల నేదో విధముగఁ దాత్కాలికశాంతి చేయవలసినదా? కాదు.

గీ. బాధమూలహేతువుగని ♦ వైద్యమటను
జేయనగుఁ; బైశాంతుల ♦ మాయదెప్పు;
డొడలిపైబయల్వెడలెడు ♦ పొడలుగంధ
కమునఁబోవునే? పోవును ♦ గంధివలన.

ఇన్ని దుఃఖములకుఁ గారణము లేమై యుండవచ్చునో?

గీ. గంజిబిచ్చమెత్తుచుఁ ద్రావి ♦ గట్టుమనుచుఁ
ద్రేఁచిపరమ దరిద్రుఁడు ♦ తృప్తిఁగనక
పట్టెడుసజ్జరొట్టెకై ♦ పలవరించి
యున్నగంజియసహ్యమై ♦ యుమ్మలించు.

గీ. సజ్జరొట్టెను దినునట్టి ♦ జనుఁడు యవల
రొట్టెఁదినుమహాభోగి వో ♦ మట్టిచూచి
కనులనీర్నించి యొంతదు ♦ ర్గతియొ యంచు
నాఁకలి యసూయచే మండి ♦ యడలు చెందు.

గీ. మంచిరొట్టెను గలవాఁడు ♦ మట్టియూప
లవలెఁజక్కనౌపాల్ద్రావు ♦ టవలిజన్మ
మందెయనిలోని కన్నీళ్ల ♦ నంటనుప్పు
నైనరొట్టెమ్రింగుడు వడ ♦ కార్తిఁబడును.

గీ. రమ్యగోక్షీరపానవి ♦ భ్రాజితుండు
రజతపాత్రలేనివగ నీ ♦ రసతఁజెందు
వెండియేదుపుదీటిన ♦ వెట్టియతఁడు
బంగరేడ్పునకై గొంతు ♦ బొంగుదోలఁచదు

గీ. బంగరునఁ ద్రావుసంపన్న ♦ వరుఁడుకడుపు
బరువునను బాలగిన్నెను ♦ బాలుద్రోఁచు;
లేనియతఁడుండి యొప్పును ♦ లేదటంచు
నున్నయతఁడు లేకొప్పును ♦ నున్నదంచు.

గీ. మానిసికినున్న దేదైన ♦ లేనిదగును
లేనిదే యుండఁదగినది ♦ లేనిదాని
కొప్పదగినది యుండి లే ♦ కొప్పలేక
లేక యేమపె బ్రదుకగు ♦ లోకమందు.

గీ. మొద్దువటువ్రెక్క సతిలేక ♦ మొత్తుకొనఁగ
మూఁడువందల యొకటవ ♦ ముదితకొఱకు
నుర్విపతి వేగు నెంతయు ♦ నున్నసరియె
లేనియేడుపు తప్పదే ♦ వ్వానికైన.

గీ. భవ్యషట్ఛాస్త్రపాండిత్య ♦ పటిమఁదనరు
కుండలికిఁగైత లేకున్న ♦ గొంతుదెగెనె?
యందుకై తప్పుచిటిచాఁప ♦ యల్లనేల?
పృష్ఠములనుండిజనులీడ్చి ♦ వేయనేల?

గీ. శ్రాద్ధభోజికిగానంబు ♦ రాకయున్నఁ
బుట్టిమునిఁగిపోయెనె? వీణఁ ♦ బట్టియుట్టె
గారిమఁకిగారిమఱిమఱి ♦ గారియనుచు
గానమునుబింక దానముఁ ♦ గలువనేల?

గీ. వటువుజదువు నెమరవేయ ♦ వదలిపెట్టి
సతిఁదలఁచిలొట్టవేయును ♦ జదువువల్లె
నొకటిరెండెప్పు డౌనని ♦ యుమ్మలించుఁ
గట్టితాటిమంగళసూత్ర ♦ గరిమఁజూచు.

గీ. పెండిలగు వెన్క సుఖియించి ♦ యుండరాదె?
సతికడుపుకాయ దోహద ♦ సమితి కొఱకు
నెఱకతట్టల మజీవంబ ♦ బఱుకుటలను
బొమగుగడ్డాలఁ బుట్టలఁ ♦ దడుమనేల?

గీ. కొడుకునెటొకని నోర్యూసి ♦ కొనఁగరాదె?
మనుమలెత్తెదు వెతనోస ♦ మాలసుంత
పుట్టగోచికి జార్పైఁట ♦ ముళ్లువెట్టి
పాలకోడెతోఁ గార్పెయ్య ♦ బందెఁబెట్టు.

ఇఁక వారిద్దఱియవస్థ—

గీ. వెలఁదితన్ముద్దుగొనఁగ నెం ♦ గిలికినమ్మ
కోపపడునని గావంచ ♦ కొసనుదుడుచు;
గండపత్రంబులకుమసి ♦ దెండటన్న
గ్రంథపత్రాలమసిదెచ్చి ♦ కాంతకిచ్చు.

గీ. తాతగారితపోమహా ♦ త్త్వఫలమునను
కూనలమ్మకొకను నూనె ♦ గుడ్డవాని
చేతిచలవను యనరాని ♦ రీతినెట్లొ
కుక్కగొడుగులు మొలుచును ♦ గొంపలోన

గీ. భవము భ్రష్టత బంధంబు ♦ పరిభవంబు
బహురుజలబాధ భాగార్థ ♦ భండనంబు
భర్తృహీనకాంతలబాధ ♦ బారుటులివు
క్రమముగా గ్రమ్ముకొను బొమ్మ ♦ జెముడుకరణి.

ఆత్మసుఖము కొఱకైన తృష్ణయేయిందులకు ముఖ్యకారణము
గాఁ గనఁబడుచున్నది.

గీ. ఉర్వీపతికి త్రిఁదృష్ణ ♦ యుద్యోగికనువ
పుల్లఁదృష్ణ; వైశ్యునిత్రాసు ♦ ముంటఁదృష్ణ;

కాంతయొడఁదృష్ణ; మేడలోఁ ♦ గకొనఁదృష్ణ;
బ్రాహ్మణుని రోమరోమ కూ ♦ పములఁదృష్ణ.

గీ. ధనమొరాష్ట్రమొకీర్తియొ ♦ తరుణిమణియొ
యేదొపైఁబడదని యొప్పు ♦ జెప్పవలయు;
వస్తువెద్దానికొ బ్రదుకు ♦ వాఁడెకాని
బ్రదుకుకొఱకునె బ్రదికెడు ♦ వాఁడులేఁడు.

గీ. వేదములఁదృష్ణ; వేదాంగ ♦ వితతిఁదృష్ణ;
యింటఁదృష్ణ; వాకిటఁదృష్ణ ♦ యిలనుదృష్ణ;
వారిధినిదృష్ణ; గాలి లో ♦ పలనుదృష్ణ;
యెటుగనినఁదృష్ణ; మఱితృష్ణ ♦ యేకతృష్ణ.

ఇట్టితృష్ణయే సర్వవేదనాపరంపరలకు మూలహేతువై యున్నది. ఇట్టితృష్ణను శాంతిపఱచినఁ జాలునా? నిర్మూలనముసేయవలయునా? శాంతిపఱచినకొలఁదిఁ దృష్ణవృద్ధియగును గాదా?

గీ. ఇచ్చుకొలఁది భిక్షుకునేప్పు ♦ హెచ్చిపోవు;
మెత్తబఱుచుకొలఁది మొండి ♦ నెత్తికెక్కు;
నోటనాన్పుకొలఁది మంట ♦ మేటియగును;
గుగ్గిలపుజిడ్డు కడిఁగిన ♦ కొలఁదిసాగు.

గీ. ముడుచుకొనుకొలందిని జలి ♦ పొడవుఁగాంచు;
విసరుకొలఁదిని గ్రీష్మము ♦ కసిమసంగు;
నుడుకునీళ్లుపోయు కొలఁదిఁ ♦ జిడుమువిరియు;
గోఁకుకుకొలఁదిని వెండ్రుకల్ ♦ గఱుసుదేరు.

గీ. ఒత్తుకొలఁదిఁ గాళులతీపు ♦ లురువుఁగాంచుఁ;
ద్రాగుకొలఁదిని జ్వరభవ ♦ తాపమెసఁగుఁ;
గడలు ద్రొక్కు కొలఁదిఁగప్ప ♦ గంతులెగయు
నడచిన కొలంది మిటమిట ♦ లాడుతృష్ణ.

కావునఁదృష్ణను మొదలంటఁ బెఱుకవలసినట్లే నిశ్చయపఱుప వలసి యున్నది. తృష్ణను నిర్మూలన మొనర్చిన నిఁకనేమి? సర్వదుఃఖములట్టె మాయమైపోవా?

గీ. రసఘుటికదాడిమిక్రిమి ◆ రాజియడఁగు;
దూడతామరపలుతీతఁ ◆ దొలఁగిపోవు;
రక్తపరిశుద్ధి జర్మను ◆ ట్రప్పతతిమాయుఁ;
గారిజపుబాగుచేఁబోవుఁ ◆ గామిలార్తి.

గీ. మొదవు సదములముగఁ జేయుఁ ◆ గుమురుపిచ్చి;
వరములు గుదియింప గమన బం ◆ధమునశించు;
నష్టుతడకకు నెగుపాప ◆ నడఁగుహిక్క;
గాని తృష్ణరో సర్వరో ◆ గములుదీఱు.

సర్వరోగములుదీఱుననుటకూడ నిశ్చయము. తృష్ణరోడనేదేహవ్యాధులుమాటిలోఁ దొంబదితొమ్మిదివఱకుఁ గలుగుచున్నవి.

గీ. కాలఁ జెక్కునాతనికిఁ ద ◆ ఱచుగక్షయ;
కుష్టుపనియాతనికి గూను, ◆ గ్రుడ్డితనము
ముచ్చిపనియాతనికిఁ బాంసు ◆ పూర్ణతయును
లోహకారకునకు రక్త ◆ మేహరుజయు.

గీ. ఉచ్చకంఠగాయకునకు ◆ నుబ్బసంబు
కుంజరపుమావటీనికి ◆ గుండెదడయు
నాశ్వికాహవభటునకు ◆ నరిశెరుజయుఁ
బడఁతెలుగు కోమటికి నధో ◆ భారగదము.

గీ. కల్లుఁద్రాగెడువానికిఁ ◆ గార్జపురుజ
యమితతాంబూలికధికమం ◆ దాగ్నిజబ్బు
స్తంభనాపేక్షులకునపుం ◆ సకతదిలుముఁ
ద్రాగువానికి గోరఁత ◆ దగ్గుమిగుల.

గీ. ఉర్వీపతిసన్నిధిని నిల్చి ♦ యూరకుపైన
నిష్ఠురీతినివిడువఁగ ♦ స్వేచ్ఛలేక
యతనియానతి లేకయే ♦ యవలికరుగ
వలనుగలుగక జాముల ♦ కొలఁదినట్లె.

గీ. క్రిందిమాపులమూత్రపు ♦ రీపబంధ
ములను జేయుచు డప్పినాఁ ♦ కలినిదగిన
యవసరములఁ దీర్పనిసేవ ♦ కాళికెల్ల
నెల్లరోగంబులును సంభ ♦ వించునిజము.

గీ. అజ్ఞములటంచు మనచేత ♦ ననఁగఁబడెను
పశువులకుఁ గీటకములకుఁ ♦ బక్షులకును
నరులతృష్ణయు లేదు; బం ♦ ధంబు లేదు
ప్రబలరోగాళిచే నింత ♦ బాధ లేదు.

గీ. అఖిలరోగార్తులైనయీ ♦ యయ్యవారు
లనిలశూన్యతమోవృత ♦ స్వాలయముల
దిగఁబెఱుఁగుఁగోలుబాములతో ♦ దేవులాడి
యంధపంగు మూకాదులై ♦ యవ్వతింత్రు.

గీ. ప్రాణిబాధలు తగ్గింపఁ ♦ బ్రతినరునికి
నేకకర్తవ్యమైయుండ ♦ నిట్టివార
లట్లుసేయరుసరికదా ♦ యార్తినొంచు
ప్రాణితతిసంఖ్యనే వృద్ధి ♦ పఱతురయ్యొ!

గీ. ఇట్టిపాపులు పతిమెడఁ ♦ గట్టఁ ద్రాడు
దమమెడనుఁ గట్టికొనియూళ్ల ♦ ధరకుమేలు
త్రాటమెడబిగియించుకోఁ ♦ ద్రాసమైన
మొలను గల్గ త్రాడు ద్రెంపి పో ♦ వలయువనికి.

కావున నిర్మూలిత తృష్ణులగునరులు నిర్మూలిత సర్వార్తులగుదు రు. కాని తృష్ణను నిర్మూలింప నరునితరమగునా? కాకేమి? ఆఁ! వాసనావాసితముగ వచ్చుచున్న తృష్ణను—మహాబలిష్ఠ మగుతృష్ణను—జన్మసహజమగు తృష్ణను—సర్వవ్యాప్తమగు తృష్ణను—నిరాకరించుటసులభమా? సులభముకాదు. కష్టమే! నిశ్చయముగఁ గష్టమే! తగినసాధనముచే నిర్మూలింపవచ్చును. అతికష్టమున—మహాకష్టమున—ఆఁ! ఏమంతకష్టము? తృష్ణ వలనఁ గలుగు నతిఘోరములగు కష్టములను—వర్ణనాతీతము లగు కష్టములను—తలచుటకునైన నలవికానికష్టములను— సహింపదగనికష్టములను—జనులనుభవించి యుండలేదా? ఆక ష్టములకంటె నీకష్టముఘనమా? కాదు; కాదు—కాదు.

గీ. పైత్యజార్తినిగడుచేదు ♦ వేపరునోటి
ముక్కలను గ్రక్కి యుక్కిరి ♦ బిక్కిరియగు
జ్వరయుతుఁడు నేలవేయుకి ♦ పాయమున వ
సంతమాలిని గ్రింగఁ ♦ జాలఁడొక్కొ

గీ. కాలిబొట్టన వ్రేల్క్రిందఁ ♦ గలవ్రణంబు
వలననొడలెల్ల మంటలు ♦ బ్రహ్మరంధ్ర
భాగమున గునపపుఁ బోట్లు ♦ పడునరునికి
పంగుళిని గోసికొనుబాధ ♦ యధికతరమె?

గీ. జోడుసింహాలపైఁ దోకఁ ♦ యూడుసింహ
మెక్కిబొబ్బరింపగ నిత్య ♦ మృతికినెదుట
నడలునుదోగ్యగ్రామసిం ♦ హములతోడ
నూరమెదుకులు మెసవిచా ♦ కుండలేఁడె?

బుద్ధిపూర్వకముగ జనులు బడుచున్న మహాభీలాతికష్టములలో తృష్ణోచ్ఛేదన కష్టము పదునాలుగవభాగమైన నుండదని నాన

మ్నకము. అలవాటుచేసినచో సిద్ధింపనిదేదియునుండదు. కాని, తృష్ణను వేఱంటఁ బెఱుకఁగల సాధనము లేవో యిప్పుడు తెలియవలసియున్నది. సరే ఆలోచింతము. (కన్నులు మూసికొని)

గీ. మనసులోపలి రసమొక్క ♦ మాఱుదశది
శలనుజల్లునవిఱిసియా ♦ జగతినంత
వెల్లిగొని సర్వజీవులఁ ♦ జల్లగాఁగఁ
దడుపుచున్నట్టులున్నది ♦ య్యెడనునాకు.

(కనులుదెఱచిలేచి) ఓహో! ఓహో! ఓహో!

సీ. ముక్తి కొట్టుల ప్రజ ♦ ముల్లెసెట్టెలనొక్క
చెవిదీయు బ్రాహ్మణ ♦ ప్రవరులార!
కుండలకల్లును ♦ ముండలచొల్లును
గలిపిపీల్చెడు ధరా ♦ కాంతులార!
చోళులందునఁ బ్రజ నోళులందునమట్టిఁ
గలిపికొట్టెడు వైశ్య ♦ తిలకులార!
ముంజేతితోఁకతో ♦ ముందుదోఁకలరెండు
గలిపితోసెడు శూద్ర ♦ గణములార!
మీరునాసోదరులు నేను ♦ మీదుబాధ
లజ్ఞతలను దీర్చుకొఱకె ♦ యవతరించి
నాఁడఁ గన్నుల దెఱువు ♦ నాదునుడుల
వినుడి బుద్ధిదెచ్చుకొనుడి ♦ వేడ్కమనుడి.

సీ. నడునెత్తితోఁకతో ♦ ముడుగుకాళ్లకులంకె
చేసెడుచీనదే ♦ శీయులార!
స్థిరవాసరంబుతో ♦ గురువాసరములంకె
వేయనిబ్రహ్మదే ♦ శీయులార!

